# ఛాయాదేవి

[ శరత్ కథలు ]

అనువాదం :

గద్దె లింగయ్య



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# ఛాయా దేవి

అలా జరుగజాలదని ముందే నువ్వు అడ్డుచెపితే నేను చేయగలిగిందేమీలేదు. కాక అయి వుండవచ్చునంటావా—ప్రపంచంలో ఏయే వింతలు జరుగుతాయో నాకుమాత్రం తెలుసా?—ఈకథ చదువు. అందువల్ల ఏహానీ సంభవించదనే నా విశ్వాసం. ఈకథవ్రాసేముందు నేను వ్రాసేదంతా నిజమేనని ప్రతిజ్ఞ చెయ్యలేను. ఒకటిరెండు సంగతులు తప్పైనా కావచ్చు, కాస్తోకూస్తో అభిప్రాయభేదమూ కలగవచ్చు- ఇందువల్ల అయ్యేదీ పొయ్యేదీ ఏముంది గనుక!

కథానాయకునిపేరు యజ్ఞదత్తముఖర్జీ. కాని సురమ అతన్ని 'ప్రకాశ్' అనేది. నాయికపేరు తెలిసిందిగదూ. కాని యజ్ఞదత్తు ఆమెను 'ఛాయ' అనే పిల్చేవాడు. ఎవరు వెల్తురో ఎవరు నీడోనని ఇద్దరూ వాదించుకుంటూఉండేవారు. కాని పర్యవసానం తేలనేలేదు. తుదకు సురమే "నీసూక్ష్మబుద్ధికీమాత్రం తోచలేదా? నువ్వే లేకపోతే నేనెక్కడుంటాను? నేను లేకపోయినా నువ్వు చిరంజీవివే. కాబట్టి నువ్వు వెల్తురువి. నేను నీడను' అని విశదపర్చింది.

యజ్ఞదత్తు నవ్వి "ఒకతరఫు డిగ్రీ పుచ్చుకోవా లనుకుంటే అలాగే తీసుకో. కాని, ఈ నిర్ణయం ఎందుకూ పనికొచ్చేదికా" దన్నాడు.

"బాగుంది, మహాబాగుంది—ప్రకాశ్! ఇంక వాదించుకోవాల్సినఅవసరం లేదు. నువ్వు ప్రకాశా నివి, నేను శ్రీమతి ఛాయని."

ఇలా అంటూ ఛాయ ప్రకాశాన్ని అనేకరీతుల విసిగించివేసింది.

కథ యింతవరకు అయిందిగాని, మీతో ద్వంద్వ యుద్ధం వచ్చిపడుతుందేమోనని భయంగా వుంది. మీరు వీరిని స్త్రీ—పురుషు లని అంటారు. స్త్రీ-పురుషులేగాని భార్యా—భర్తలు కారని నే నంటాను. అయితే అశాస్త్రీయ ప్రేమా ?అని మీరు తప్పకుండా కళ్ళు పెద్దవిచేసి అడుగుతారు. నే నంటాను—అది పవిత్రపేమ అని. మీ కేవిధంగాను విశ్వాసం కలుగదు. మీరు వెక్కిరింపుగా వయ సెంత ? అని అడుగుతారు. "ప్రకాశ్ వయస్సు ఇరవైమూడు, ఛాయకి పద్ధెనిమిదేండ్లు" అని చెపు తాను.

తర్వాత వినా లనుకుంటే చెప్తాను. వినండి—

యజ్ఞదత్తు గడ్డం చేసుకొని, తలకు సువాసన నూనె రాచుకొనేవాడు. పరి కొన్న థకాకా ధోవతి,

ఎసెన్సుపట్టించిన షర్టు, కాళ్ళకు మొఖమల్ స్లిప్పర్లు – వాటిపైన ఛాయ స్వహస్తాలతో పూవు లల్లింది – ధరించేవాడు. గ్రంథాగారంలో కావలసినన్ని పుస్తకాలు. ఇంట్లో దాసదాసీజనం.

బల్ల కొక అంచున కూర్చుని యజ్ఞదత్తు వ్రాస్తున్నాడు. ఎదురుగా పెద్ద నిలువుటద్దం వుంది. పరదా తప్పించుకొని ఛాయ అతిమెలకువగా ప్రవేశించింది. మెదలకుండా వెనుకపాటున వచ్చి కళ్ళుమూయాలని ఆమెవుద్దేశ్యం. కాని వీపువెనక్కి వచ్చి చేతులు చాచగానే ఎదుటి అద్దంమీద పడింది, దృష్టి. యజ్ఞదత్తు తనమొహంవంకే చూస్తూ నవ్వుతూండడం చూచింది. సురమ కూడ నవ్వింది. "ఎందుకు చూస్తావ్?" అన్నది.

యజ్ఞదత్తు—ఇది నాతప్పా?

సురమ—మ రెవరిదీ?

య—సగం నీది. మిగతాసగం యీ అద్దానిది.

సు—నేను దా న్నిప్పుడే మూసేస్తాను.

య—కప్పివెయ్యకు, కాని. మిగతాదాని కేంచేస్తావ్?

సురమ రెండుమూడుసార్లు ఊగిసలాడి అన్నది— ప్రకాశ్!

య—ఏమిటి ఛాయా!

సు—నువ్వు చిక్కిపోతున్నావే !

య—నా కలా అనిపించడంలేదే.

సు—నువ్వు సరిగా తిండే తినటంలేదే?

యజ్ఞదత్తు నవ్వి అన్నాడు—సురా, జగడానికి వచ్చావేమిటే?

సురమ—హుఁ!

య—నే నందుకు ఒప్పుకోనుగా.

సు—నువ్వు పెళ్ళెందుకు చేసుకోవు ?

య—దీనికి రోజూ ఒకసారి సమాధానం చెప్తూనే వున్నానుగా.

సు—అలా కాదు! చేసుకొనితీరాల్సిందే.

య—సురా, నీ పెళ్ళిచేసుకోవే ?

సురమ యజ్ఞదత్తుచేతిలోని వుత్తరం లాక్కొని అన్నది—ఛీ, విధవ కెక్కడైనా పెళ్ళవుతుందా?

యజ్ఞదత్తు కాస్సేపాగి చెప్పాడు— ఏమో ! కొందరు జరగవచ్చునంటారు, కొందరు కూడ దంటారు.

సురమ—అయితే దీనికి నన్నే నిమిత్తమాత్రురాలిని చెయ్యాలనే ప్రయత్నం దేనికి ?

యజ్ఞదత్తు దీర్ఘనిట్టూర్పు విడిచి అడిగాడు—అయితే ఇక ఎప్పుడూ నా సేవజేస్తూనే జీవితం గడిపేస్తావా ?

'హుఁ' అని ఆమె టపటప అశ్రువులు రాలుస్తూ ఏడ్వసాగింది.

యజ్ఞదత్తు ఆమెకన్నీళ్ళు తుడుస్తూ అన్నాడు— సురా, ఇంతకూ నీ మనసులోని కోరిక ఏమిటో స్పష్టంగా చెప్పవూ?

సురమ—నన్ను బృందావనం పంపించు.

య—నన్ను విడిచి వుండగలవా?

సురమనోట మాట రాలేదు. ఒకటి రెండుసార్లు కుడి ఎడమలకు తలాడించుటతోపాటు కన్నీరు ఏక ధారగా ప్రవహించసాగింది.

"ఆ కథ చెప్పవూ?" అన్నది సురమ.

"ఏ కథ సురమా!" అని యజ్ఞదత్తు అడిగాడు.

"అదే, నన్ను బృందావనంలో కొన్నావే. ఎన్ని రూపాయలకు కొన్నావ్?

"ముప్ఫై రూపాయలకి. అప్పుడు నాకు పధ్దెనిమిదేళ్లు. బి. ఏ. పరీక్ష అవగానే పడమటిదేశం చూద్దామని వెళ్ళాను. అప్పుడు అమ్మ జీవించే వుంది. ఆమెకూడ నావెంట ఉన్నది. ఒకనాటి మధ్యాహ్నం మాలతీతీరం ప్రక్కగా సన్యాసినులు కొందరు పాటలు పాడుకుంటూ వెడుతున్నారు. మొట్టమొదటిసారిగా నిన్ను నేను చూచింది వారిలోనే. యౌవనారంభదశలో ప్రపంచం రమణీ



యంగా కన్పిస్తుంది. కాని కళ్ళతో ఆ మాధుర్యాన్ని పూర్తిగా గ్రోలడం అసంభవమే. మనసు లాంటి మరి రెండు కళ్ళుండి ఆ శోభ ననుభవించ గల్గితే బాగుండునని అభిలాష కల్గింది–కాని దాన్ని వివరించి చెప్పగల్గితే—ఇదేమిటి సురమా, ఏడుస్తున్నావా?"

"లేదు. నువ్వు చెప్పు."

"నువ్వప్పుడు పదమూడేళ్ళ సన్యాసినివి. చేత్తో తంబుర మీటుతూ పాడుతున్నావు."

"ఫో, పాడటం నాకేం చేతనవును?" అన్నది సురమ.

"అప్పుడు పాడేదానివిలే. ఆ తర్వాత యెంతో యాతనపడి నిన్ను సంపాదించాను. నువ్వు బ్రాహ్మణ పిల్లవి. బాలవిధవవు—అమ్మ మీ తీర్థానికి వచ్చి మళ్ళీ తిరిగిరాకుండానే చనిపోయింది. నిన్ను తీసుకొచ్చి ఆమెకే అప్పగించాను. ఆమె నిన్ను గుండె కదుముకున్నది. తర్వాత ఆమె ప్రాణం వదిలే ముందు మళ్ళీ నాకే యిచ్చిపోయింది."

"మా యిల్లెక్కడుంది యజ్ఞదా?"

"కృష్ణనగరసమీపంలో యెక్కడో వున్నట్టు విన్నాను."

"నా కెవరూ లేరూ?"

"నే నున్నానుగా, నీకు సర్వం నేనే సురమా!"

సురమ కళ్ళు మళ్ళీ చెమ్మగిల్లినై. "నువ్వు మళ్ళీ నన్ను అమ్మగలవా?" అని అడిగింది.

"ఉఁహూఁ, ఆపని చేయలేను. నన్నమ్ముకో కుండా ఆపని జరుగదు" అన్నాడు యజ్ఞదత్తు.

సురమ ఏమీ మాట్లాడలా. అశ్రుపూర్ణ నేత్రాలతో అతనివైపు చూస్తూ వుండిపోయింది. కొంత సేపటికి యిలా అన్నది — "నువ్వు అన్నయ్యవి, నేను చెల్లెలిని—మరి మన యిద్దరిమధ్యకు ఒక చక్కని కోడలిని తీసుకురావూ అన్నయ్యా?"

"ఎందుకూ?"

"పగలస్తమానం ఆమెను సింగారించి, అలంకరించి నీదగ్గరికి తీసుకొచ్చి కూర్చోబెడుతూంటాను"

"నువ్వాపని మనస్ఫూర్తిగా చేయగలవ్వూమరి?"

సురమ తలెత్తి అతని కళ్ళల్లో కళ్ళెట్టి "ఈర్ష్య పడటానికి నేనంత నీచురాలనా?"

"ఈర్ష్యపడవు గానీ, నీ స్థానం కోల్పోతావా?"

"ఎందుకు కోల్పోతాను? నేను రాజాని. రాజాగానే వుంటాను. కేవలం ఒక మంత్రిని ఏర్పాటు చేసుకుంటాను. ఇద్దరం కలసి నీ రాజ్యాన్ని నడుపుతాము; అప్పుడు భలే ఆనందంగా వుంటుంది."

"ఇటుచూడు ఛాయా! పెళ్ళిచేసుకోవాలని లేదు; కాని నీకు తోడు ముఖ్యావసరమైతేమాత్రం అలాగే వివాహమాడుతానులే" అన్నాడు యజ్ఞదత్తు.

"ఆc, తప్పకుండా చేసుకో చాలా ఆనందంగా వుంటుంది. ఇద్దరం సరదాగా రోజులు గడుపుతాం"

ఈమాటలని సురమ తనలో యిలా అనుకున్నది — "ఎటుచూచినా నాకెవరూ లేనేలేరు. మానాభిమానాలు మాత్రం ఏం వున్నట్లు? కాని నామూలంగా నువ్వు అందరినోళ్ళా పడటమెందుకు? నువ్వు నా దేవతవి! నువ్వు పెళ్ళిచేసుకో, నీముఖం చూస్తూ నే నన్ని సహించుతా."

# 3

పొరుగువారి విషయం పట్టించుకోనివారు కలకత్తాలో చాలామంది వుంటారు. కాని పట్టించుకొనేవాళ్ళు-అందులో అతిగా పట్టించుకొనేవాళ్ళూ చాలమంది వుంటారు. ఈ రకంజనం 'యజ్ఞదత్తు బి.ఏ. ప్యాసయ్యాడేగాని, ఒట్టి భ్రష్టుడైపోయా'డనేవారు. వారలా అనటం సురమను మనసులో పెట్టుకునే. అప్పుడప్పుడు ఈ మాటలు సురమ, యజ్ఞదత్తుల చెవినికూడ పడుతూండేవి. విని యిద్దరూ నవ్వుకునేవారు.

మనిషి మంచివాడైనా చెడ్డవాడైనా - గొప్ప వాడైతే అతని యింటికి జనం - ముఖ్యంగా ఆడ వాళ్ళు వస్తూంటారు. అలా వచ్చిననాడల్లా ఎవరైనా "సురమా, నువ్వు నీ అన్నయ్య పెళ్ళి చేయవేం?" అంటే, "మంచిపిల్లని చూచి కుదర్చకూడదూ ?" అనేది సురమ.

ఆ అన్నది సురమ స్నేహితురాలైతే నవ్వి, అనేది - "మంచిపిల్ల దొరకటం కష్టమే. అదీగాక రోజూ నీ అందాన్ని చూస్తున్న ఆయనకళ్ళకి -"

మధ్యలో "పోవే, నినోరుమండిపోను -" అం టూంటే సురమ మొహం వాత్సల్యం, గర్వములతో జేవురించేది.

ఆనాడు మధ్యాహ్నం టపటప వానచినుకులు పడుతున్నవి. సురమ గదిలో ప్రవేశిస్తూనే "పిల్లని చూచి వచ్చాను. నాకునచ్చింది" అన్నది.

"అమ్మయ్య! నెత్తిమీదబరువు తగ్గిపోయిందన్న మాట! ఎక్కడా? చెప్పు వింటాను" అన్నాడు యజ్ఞదత్తు.

"ఆపేటలో, మిత్తర్ల యింట్లో"

"బ్రాహ్మణులమైయుండి కాయస్థులయింట్లో నా ?"

"ఏం, కాయస్థులయింట్లో బ్రాహ్మలువుండరా?

ఆ పిల్ల తల్లి అక్కడ వంటపనిచేసేది. పిల్ల చాలా మంచిదని విన్నాను. నీకు నచ్చితే యింటికి తీసుకురా" అన్నది సురమ.

యజ్ఞదత్తు "ఈలోకంలో ఓబిచ్చగత్తె లేకుండా నా జీవితమే గడవనంత దౌర్భాగ్యుడినా నేను ?" అన్నాడు.

"బిచ్చగత్తె నేరి తీసుకురావటం నీకు కొత్తేమీ కాదుగా !"

"మరి ?"

"ఏం లేదు, నువ్వు వెళ్ళి చూచిరా, నచ్చితే మాత్రం 'వ' ద్దనకూడదు."

"నచ్చే దెలాగూ లేదు."

"నచ్చుతుందండీ, బలే బాగా నచ్చుతుంది. ఒకసారి చూచిరా ముందు."

ఛాయాదేవి ప్రకాశ్ దేపతకి ఒళ్ళు, మొహం తోమి పన్నీటితో కడిగి, తలదువ్వి, చక్కగా అలంకరించి అద్దంముందుకు తీసుకెళ్ళి నిలబెట్టింది. అద్దంలో చూచుకొని యజ్ఞదత్తు సిగ్గుపడ్డాడు. "ఛీ, ఎందుకిదంతా ?" అన్నాడు.

"ఉండనిద్దూ. నువ్వు వెళ్ళి చూచిరా" అన్నది.

"యజ్ఞదత్తు బండిఎక్కి పిల్లని చూచేందుకు ఒక స్నేహితుణ్ణి వెంటబెట్టు కెళ్ళాడు.

"వారియింటికెందుకోయ్?"అనడిగాడుమిత్రుడు.

"వారియింట్లో ఒక బిచ్చగత్తెకూతురు వుందోయ్. ఆమెను పెళ్ళాడాలి."

"ఏమిటి నువ్వనేది? ఈ ఉపదేశమిచ్చిం దెవరు?

"మీరంతా ఎవర్నిగురించి ఈర్ష్యపడి చస్తున్నారో, ఆ ఛాయాదేవే" అన్నాడు యజ్ఞదత్తు.

యజ్ఞదత్తు మిత్రునితో మిత్రల్ల యింటికి వెళ్ళాడు. పిల్ల తివాసీమీద కూర్చున్నది. చాలా పుతుకులుపడిన నేతచీరె – నేత పల్చగావున్నది–కట్టుకొన్నది. చేతులకు మామూలు గాజులు, గిల్టుమురుగులు—అక్కడక్కడ వాటిలోపలి ఇత్తడి కనపడుతోంది—వున్నై. తలకు రాచుకున్ననూనె మొహంమీదికి కారుతోంది. ఆమెనుచూచి మిత్రులిద్దరూ నవ్వుకున్నారు. నవ్వును కనపడనీకుండా పిల్లవైపుచూస్తూ యజ్ఞదత్తు "నీ పేరేమిటి?" అని అడిగాడు.

పిల్ల తన విశాల నీలినేత్రాలతో అతనిమొహంలోకి చూస్తూ "ప్రతుల" అని చెప్పింది.

యజ్ఞదత్తు మిత్రునితో పరిహాసంగా "ఏం మిత్రమా *గదాధరుడు కాదుగదా?" అన్నాడు.

---

* శ్రీ. శే. గిరీశచంద్రఘోష్‌గారి నాటకంలో పోలీసుల సోదాభయంచే స్త్రీ వేషం వేసుకొనే పాత్ర.

స్నేహితుడు నెమ్మదిగా ఒక స్తోత్రం చేసి "మాట్లాడకుండా స్నానం చేసెయ్యవోయ్" అన్నాడు.

"ఆఁ, ఇదిగో యిప్పుడే" అని,

"సరే,—మంచిది. ఏం చదువుతున్నావు?" అని అడిగాడు ఆమెని.

"ఏం లేదు"

"మరీ మంచిది. పని - పాటులు చేతనవునా?"

ప్రతుల తలాడించింది. ప్రక్కనే నిలబడివున్న దాసి "బాగా పని తెలిసినపిల్ల బాబుగారూ. వంట చేయడం, వడ్డించడం, ఇంకా ఇంటిపనుల్లోను తన తల్లిలాంటిది. నోట్లోనుంచి మాటేరాదు. బలే శాంతంగల పిల్లలెండి" అని వ్యాఖ్యానించింది.

"అది కనబడుతూనేవుందిలే" అని యజ్ఞదత్తు పిల్లని మళ్ళీ అడిగాడు— "నీ తండ్రి వున్నారా?"

"లేరు"

"తల్లికూడ చనిపోయిందా?"

"అవును"

ఆ అమాయక మూగపిల్లకళ్ళలో నీరుకమ్మటం చూచి యజ్ఞదత్తు అడిగాడు— "నీ కెవరూ లేరా?"

"లేరు"

"మా యింటికి వస్తావా?"

ఆమె మెడఆడించింది. కాని ఇంతలో ఆమె

చూపు పైవేపుకు మళ్ళింది. కిటికీచువ్వలగుండా నిప్పులు కురుస్తున్న రెండుకళ్లు కన్పించాయి. ఆమె భయపడి "ఊఁ హూఁ" అన్నది మళ్ళీ.

బయటికివచ్చి వారు మిత్తిర్ గారిని కలుసుకున్నారు.

ఆయన. "పిల్ల ఎల్లావుంది?" అనడిగాడు.

"బాగానే వుంది"

"అయితే పెళ్ళికి లగ్నంపెట్టించవచ్చుగా ?"

"ఆ, ఆ"

# 4

పది-పన్నెండేళ్ళ కుర్రవాడిచేతిలోనుంచి సగం చదివిన కుతూహలపూరితనవలను అతని శ్రేయోభిలాషి నిర్దయతాపూర్వకంగాలాగి దాచివేస్తే ఆకుర్రవానిస్థితి యెలావుంటుందో, లోపలిప్రాణం వ్యాకులభావంతో ఆ చిన్నపోయిన కుర్రవానిని ఆ గదిలోకి ఈ గదిలోకి ఎలా పర్వెత్తిస్తుందో, భయపడుతూన్న అతని తీక్షణదృక్కులు ఆ అతిప్రియవస్తువు నన్వేషించుటలో వ్యాసులంతో ఎలా విసుగెత్తి పోతుందో, మరి ఎవరిమీదో ఎలా కోపంతో విరుచుకుపడాలనిపిస్తుందో—సరిగా అదేవిధంగా సురమయజ్ఞదత్తుకోసం విలవిలలాడసాగింది వెదకి వెదకి బయటికి తెచ్చేదేమిటో ఆమె కేం తెలుసు! కుర్చీలు,

బెంచీలు, సోఫా, మంచం,గది, నగండా—అన్నిటి మీదఆమెకుకోపంగావుంది. బజారువేపుకటకటాలు కూడ ఆమె కసహ్యాంగా తోచినై. ఇక్కడ కూర్చు నిలేని, అక్కడ కూర్చుంటోంది. అక్కణ్నుంచి లేచి ఇంకోచోట చతికిలబడుతోంది. ఈస్థితిలో యజ్ఞ దత్తు గదిలోకి వచ్చాడు.

"ఏమయింది ప్రకాశ్ మహాశయా?"

ప్రకాశ్ మొహం గాంభీర్యతవహించింది.

సురమ అడిగింది "నచ్చిందా?"

"ఆ"

"పెళ్ళెప్పుడు?—"

"బహుశః యీ నెలలోనే"

నిరానందోత్సాహంతో సురమ సమీపించింది. కాని ఏవిధమైన అల్లరి, గోల చెయ్యకుండానే "నా మీద ఒట్టు, నిజం చెప్పు?" అంది.

"బలే సంకటం తెచ్చిపెట్టావే! నేను నిజమే చెపుతున్నాను" అన్నాడు యజ్ఞదత్తు.

"నా ముఖం చూచి చెప్పు. నచ్చిందా?"

"ఆ,—"

ఇంక సురమకి ఏమనటానికీ తోచలేదు. దబా యించబడిన పిల్లలు ఏడ్చేముందు అట్టేటు మెడా

డించి ఏదో అర్థంలేనిమాట అనేసినట్లే, సుగమకూడ మెడవ్రాపి, గట్టిగా "నేను ముందే చెప్పానుగా!" అన్నది.

యజ్ఞదత్తు తన ఆలోచనలో లీనమైవున్నాడు. అంచేత ఆ మాటకు అర్థమేలేదని గ్రహించనేలేదు. 'నచ్చుతుంది' అని మొదట్లో సురమ అననూలేదు. అసలామె పిల్లని చూపించనూలేదు. అంతేగాక ఇంతతొందరగా పిల్లనచ్చుతుందనీ, పెళ్ళిఖాయమవుతుందనీ ఆమెఅనుకోలేదు. కాబట్టే ఆమె పగలంతా తన గదిలోనే పడివుండి ఈ విషయాన్నిగురించే ఆలోచించసాగింది. రెండు రోజుల్లో యజ్ఞదత్తుకు చాలావరకు బోధపడింది— "సురా, ఈపెళ్ళి చేయించకు చెల్లీ" అన్నాడు.

"బలే! అదెలా వీలవుతుంది? సంబంధంనిశ్చయమైందిగా?" అన్నది సుగమ.

"నిశ్చపడిం దేమీలేదు"

"లేదూ! అలా వీల్లేదు. ఆఅనాథబాలికని సుఖపెట్టాలన్నది కాస్త ఆలోచించు. ముఖ్యంగా ఒప్పుకొచ్చి యిప్పుడు మాటతప్పుతావా?"

యజ్ఞదత్తుకి ప్రసతులసుమారిమొహం జ్ఞాపకం వచ్చింది. అనాడామె నీలినేత్రాల్లో శాంత, ఓర్మి భావాలు ప్రతిబింబించటం గమనించాడు. గదూ!

ఇంక మాట్లాడకుండా వూరుకున్నాడు. అయినా ఎన్నో సంగతు లాలోచించాడు. సురమ విషయంలో ఎంతగానో ఆలోచించాడు. వర్షం కురిసేనాడు వాన పురుగులు యింటినిండా మూగినట్లే, అతని మనస్సంతా నిస్పృహతో నిండిపోయింది. పైగా వాటికి మరుగునపడిన నివాసస్థానం వెతికినా కన్పడనట్లే, సురమ నోటిమాటలు హృదయంలోని ఏ గుప్త ఆకాంక్షతో తండోపతండాలుగా బయటపడుతు న్నాయోకూడ అతనికి అంతు చిక్కలేదు. అతని కళ్ళమీద ఏదో అస్పష్టమైన తెరపడినట్టు, అతనికే విధంగానూ సురమ మొహం కన్పించలేదు.

## 5

యజ్ఞదత్తు వివాహంచేసుకొని భార్యని ఇంటికి తీసుకొచ్చాడు. తీవ్రరోగపీడితుడైనవాడు ఇంట్లో మరెవరూ లేకపోతే, అతను తన యావచ్ఛక్తినీ కూడదీసుకొని నీళ్ళకుండవద్దకు పరుగెత్తి దాన్ని నోటకరచుకున్నట్లే, సురమ కొత్తకోడలిని గుండె కదుముకొన్నది. తనకున్న నగలన్నీ ఆమె కలంక రించింది. తన బట్టలుకూడ ఆమెపెట్టెలో నింపింది. నిర్జీవమొహంతోనే పగలంతా వధువును అలంక రించుతోన్న హడావుడిచూచి యజ్ఞదత్తు మొహం

అదోలా వుంది. గంభీరమైన కల ఏదైనా వస్తే సహించవచ్చు. అసహ్యమవగానే మెలుకువ వచ్చేస్తుంది. కాని, మేలుకొనివుండే స్వప్నంచూస్తే గుండె ఆగిపోతుంది. దానికి అంతున్నట్టుండదు. మరి నిద్ర తెలియటమనేదివుండదుగా. ఇది నిజమా, కలా? అనిపిస్తుంది. ఛాయ, ప్రకాశ్‌ల కిద్దరికీ ఇలాగే అనిపిస్తోంది.

ఒకనాడు యజ్ఞదత్తు తనగదిలోనుంచి పిల్చాడు.

“ఛాయా!”

“ఏమిటి యజ్ఞ అన్నయ్యా?”

“ప్రకాశ్ అనలేదే?”

సుగమ తలనంచుకొని “ప్రకాశ్”, అంది.

యజ్ఞదత్తు రెండుచేతులూ చాచి “చాలారోజులనుంచి దగ్గరకే రాలేదు. ఇలా రా” అన్నాడు.

సురమ అతనిమొహంకేసి ఒకసారి చూచి “వహ్వా! నేను బలేదాన్నినే! కోడలిని ఒక్కదాన్నే వదిలేసి వచ్చాను” అంటూనే గబగబ పారిపోయింది.

కోపంలో ఏ అపరిచితవ్యక్తినైనా చెంపమీద కొట్టితే అతడు శాంతంగా క్షమించి వెళ్ళిపోతే ఆ దెబ్బకొట్టిన మనిషిమనసెంత వ్యథ చెందుతుందో సరిగా ఆ క్షమింపబడిన అపరాధిమనస్సులాగే

యజ్ఞదత్తుమనస్సుకూడ క్రమంగా ఉత్సాహాన్ని కోల్పోసాగింది. తాను తప్పుచేస్తే సురమహృదయ పూర్వకంగా తన్ను క్షమించుతున్నదనిపిస్తోం దతనికి.

సురమ సర్వాభరణాలంకృతమైన నవవధువు నతనివద్ద బలవంతంగాకూర్చోబెట్టేది. చీకటిపడగానే బైట గొళ్ళెంపెట్టేసేది. యజ్ఞదత్తు చెంపక్రింద చెయ్యిపెట్టుకొని ఆలోచించుకూండేవాడు. భార్య కూడా కొంచెంకొంచెం గ్రహించుతోంది. ఆమె బాగా ఈడొచ్చినపిల్ల కాకపోయినా స్త్రీయేగద; స్త్రీకి సహజమైన తెలివి లేకుండా చెయ్యడుగా బ్రహ్మ. ఆమెకూడ తెల్లవార్లూ మేల్కొనేవుండేది.

పెళ్ళిఅయి ఎనిమిదిరోజులైనా కాలేదు. ఇంతలో ఒకనాటిఉదయాన్నే యజ్ఞదత్తు సురమని పిల్చి "సురా, కోడలిని వర్ధమాన్ తీసుకెళ్ళి అత్తయ్యకి చూపించి వస్తా" నని చెప్పాడు.

♦ ♦ ♦ ♦

దామోదరనది అవతలిప్రక్క మేనత్తగారివూరు వుంది. ఆమెయింటికివెళ్ళి "అత్తా, కోడలిని తీసుకొచ్చాను" అన్నాడు యజ్ఞదత్తు.

"అరె, పెళ్ళిచేసుకున్నావా! ఓహో, బ్రతుకు నాయనా, వెయ్యేళ్ళు బ్రతుకు. చాల బాగుంది. చందమామలాంటిపిల్ల. ఇక మనిషిలాగా ఇల్లూ

వాకిలీ చూచుకో నాయనా!" అని మేనత్త ఆశీర్వదించింది.

"అందుకేగా సురమ బలవంతంగా ఈ పెళ్ళి చేసింది" అన్నాడు యజ్ఞదత్తు.

"మంచిదే, సురమే చేసిందా పెళ్ళి?"

"ఆమే చేసింది. కాని అదృష్టం బాగుండలా. ఈ పిల్లతో కాపురం చెయ్యడానికి వీల్లేకుండా వచ్చింది."

"అదేమిటి నాయనా! ఎందుకని?"

"నాది నరగణమని నీకు తెలుసుగా అత్తా! ఈమెది రాక్షసగణమయింది. ఇద్దరం కలిసిఉంటే జీవించనని చెప్పాడు జ్యోతిష్కుడు."

"అరె అబ్బాయ్, మరి ఈ సంగతి — "

యజ్ఞదత్తు మధ్యలో ఆపి "ఇప్పుడు త్వొందరలో అన్ని విషయాలూ ఆలోచించలేదు. ఏంచేస్తాను. ఇంక నీదగ్గరేవుంటుంది. నెలకి యాభయ్యేసి రూపాయలు పంపుతూంటే సరిపోతుందా?" అన్నాడు.

"ఆ. సరిపోతుందిలే. పల్లెటూళ్ళో పెద్ద కష్టమేముంది? ఆహా, చంద్రబింబంలాంటి మొహం! పెద్దదయిందికూడాను. ఏంరా జగ్గూ, శాంతి చేయిస్తే సరిపోదూ?" అనడిగింది మేనత్త.

"అలా వీలవుతుంది. నేను భట్టాచారిగారిని

అడిగి ఏం చెయ్యాలో నీకు కబురు పంపుతాను.''

''అలాగే కబురంపు, నాయనా!''

సాయంత్రం భార్యను దగ్గరకు పిల్చి యజ్ఞదత్తు ''నువ్విక్కడే వుండు'' అని చెప్పాడు.

ఆమె తలాడించి ''సరే'' అన్నది.

''నీ కెప్పుడేది కావలసొచ్చినా నాకు తెలియ జెయ్యి.''

''సరే.''

''నీకు వుత్తరం రాయటం వచ్చా?''

''రాదు''

''అయితే మరెలా తెలియజేస్తావు!''

నవవధువు పెంపుడు హరిణిలాగా భర్త మొహం చూస్తూ మెదలకుండా నుంచున్నది. యజ్ఞదత్తు మొహం త్రిప్పేసుకొని వెళ్ళిపోయాడు.

మేనత్తగారి ఇంటివద్ద కోడలు బాగ పెందలాడే లేచి గృహకృత్యాల్లో పాల్గొనేది. ఊరకే కూర్చోవటం ఆమెకు అలవాటే లేదు. బొత్తుగా క్రొత్తదైనా ఎంతో పరిచితురాలివలె ఇంటిపనులు చక్క బెట్టసాగింది. రెండుమూడు రోజుల్లోనే అటువంటిపిల్ల అన్నియిళ్ళల్లోను పుట్టదని గ్రహించింది ముసలమ్మ.

కోడలికి నగలు చాలా వున్నై. పేటజనం అందరూ చూడవచ్చేవారు. ఒక్కొక్కళ్ళు ''ఈ

నగలన్నీ మీనాన్న చేయించినవేనా?'' అని అడిగేవారు.

''నాకు అమ్మా, నాన్నా లేరు. మా ఆడపడుచు యిచ్చింది'' అని చెప్పేది కోడలు.

ఒకరిద్దరు సమవయస్కులు స్నేహంకలిసిన తర్వాత తరచితరచి రహస్యం తెలుసుకోవాలని ప్రయత్నించసాగారు. ''మీ ఆడబిడ్డ చాలా గొప్పది కాబోలు!'' అనేవారు.

''అవు'' నని సమాధానమిచ్చేది.

''ఈ నగలన్నీ ఆమెవేనా?''

''అన్నీని''

''ఆమె పెట్టుకోదూ?''

''ఆమె విధవ కదూ, పెట్టుకోదు''

''వయస్సెంత వుంటుం దేమిటి?''

''మనకంటె కాస్త పెద్దది. ఆమె బలవంతంగా నాతో తనఅన్నగారిపెళ్ళి చేయించింది.''

''నీ భర్త ఆమె చెప్పినట్లు వింటాడా యేం?''

''ఆ, ఆమె మహాపతివ్రత. అందరూ ఆమెను ప్రేమిస్తారు.''

## 6

మేడమీది కిటికీగుండా యజ్ఞదత్తు తిరిగిరావటం సురమ చూచింది. వెంట కోడలు లేదు. అతడు

ఇంట్లోకి రాగానే "మరదలిని ఎక్కడ వదలిపెట్టి వచ్చావు అన్నయ్యా?" అని అడిగింది.

"అత్తగారి యింటివద్ద."

"ఎందుకు తీసుకురాలేదు?"

"ఉండనీ అక్కడ. కొన్నాళ్ళయ్యాక చూడొచ్చులే."

ఇది సురమహృదయానికి శూలంలా తగిలింది. ఇద్దరూ మాట్లాడటం మానేశారు. ఆత్మీయుల్లో వాదించుతూ వాదించుతూ అకస్మాత్తుగా జగడమై కొంతసేపు యిద్దరూ మెదలకుండా కూర్చున్నట్లే యీ యిద్దరూకూడ మౌనంగా రోజులు వెళ్ళబుచ్చుతున్నారు. "చాలా ప్రొద్దెక్కింది, స్నానం చేసి భోంచెయ్యి" అనేది సురమ. "ఆఁ, యిప్పుడే లేచి వెడుతున్నా" అనేవాడు యజ్ఞదత్తు. అంతే.

ఇలాగే కొన్నిరోజులు గడచిపోయాయి.

ఒకచోటే కలిసివుంటూ గృహనిర్వహణభారం వహించుతుండగా అలా వుండటం ఎన్నాళ్ళు సంభవమౌతుంది? మళ్ళీ చనువు వృద్ధిచెందసాగింది. యజ్ఞదత్తు మళ్లీ "ఛాయా!" అని పిలుస్తున్నాడు. కాని ఛాయ 'ప్రకాశ్' అని సంబోధించటంలేదు. 'యజ్ఞ అన్నయ్యా' అని, 'అన్నయ్యా' అనీ

మాత్రమే పిల్చేది.

ఒకనాడు సురమ "అన్నయ్యా, దాదాపు మూణ్ణెల్లు అవవస్తోంది. ఇంక వదినెను తీసుకురా" అంది.

యజ్ఞదత్తు "వస్తుందిలే" అని త్రోసిపుచ్చాడు. సురమ అతని మనోభావం గ్రహించి ఊరుకున్నది.

మేనత్తవద్దనుంచి అపుడపుడు జాబువస్తూనేవుంది. 'కోడలికి మలేరియా వస్తోందనీ, మందిప్పించాలనీ' రాయించింది. అలా రాయించినప్పుడల్లా యజ్ఞదత్తు ఎక్కువ డబ్బు పంపుతూండేవాడు. ఇలావుండగా ఒకనాడాకస్మికంగా మేనత్తచనిపోయినట్లు వుత్తరం వచ్చింది.

యజ్ఞదత్తు వర్ధమాన్ వెళ్ళేందుకు బయల్దేరాడు. కోడలిని తీసుకురమ్మని సురమ ఒక్కేసి చెప్పింది అతనితో.

వర్ధమాన్‌లో మేనత్తకర్మ అయిపోయినతర్వాత ఒకనాటి మధ్యాహ్నం యజ్ఞదత్తు వరండాలో నిల బడి ఇంటికి వెళ్ళాలని ఆలోచించుతున్నాడు. ప్రాంగ ణంలో ధాన్యంపురివద్ద భార్య నిలబడివుంది. ఆమెను చూచాడు. ఇద్దరిచూపులూ కలియగానే దగ్గరకు రమ్మని చేత్తో సైగచేశాడు.

ఆమె దగ్గరకు వచ్చింది.

"ఏమిటీ?" అని అడిగాడు.

"మీతో ఒకమాట చెప్పుదా మనుకున్నాను."

"సరే, చెప్పు."

ఆమె ఎదురుగుటక మింగుతూ "ఏదైనా అవసరమైతే కబురుచేయమని మీ రానాడు చెప్పారు గదూ—"

"అవునవును, ఏం కావాలి, చెప్పు?"

"ఇక్కడ అంతా నన్ను 'పీడాకారి' నంటున్నారు. ఇంక ఇక్కడ వుండా లని లేదు."

"మరి ఎక్కడ వుండా లని వుంది?

"నా కన్ని పనులూ చేతనవును. కలకత్తాలో ఎక్కడైనా మంచికుటుంబం చూచి కుదిర్చితే—"

"మీ యింటికి వెళ్ళావా?"

"మా యిల్లా? నాకు యిల్లెక్కడుంది? వెనకటివారు యిప్పుడు వుండనిస్తారా?"

యజ్ఞదత్తు భార్యముఖాన్ని చేత్తో పైకెత్తి "నా యింటికి వస్తావా?" అన్నాడు.

"వస్తాను."

"సురమ నీకోసం ఆదురాపడుతోంది."

సురమపేరు విని సంతోషంతో ఆమెమోము వికసించింది. "వదిన నన్ను తెలుస్తుందా?" అని అడిగింది.

"ఎప్పుడూ తలుస్తూనే వుంది."

"అయితే తీసు కెళ్ళండి"

ప్రపంచంలో కొందరు ఇతరులనుగూర్చి తమ అభిప్రాయాలను వెల్లడించాలన్నబుద్ధే లేనివారు కూడ వుంటారు. పైగా వారు ఆ ఇతరులపైనే ఆధారపడివుండి, తమ్ముగూర్చి ఎవరిసలహాఅయినా తీసుకోవడం అవసరమనే అనుకోరు. యజ్ఞదత్తుభార్య అలాంటిదే. ఆమె తనవిషయం తానే యోచించుకుంటుంది. ఇంకెవర్నీ అడగదు. ఆమె ఆలోచించి యిలా చెప్పింది—"మీకు అమంగళంజరుగుతుందేమోనని భయంగానేవుంది. కాని మరి నేను యెక్కడుంటాను! కాకపోతే నే నక్కడ క్రిందే ఉంటాను. పనులన్నీ చేసుకోవటంలో క్రిందేసుఖంగావుంటుంది."

"పైన నువ్వుండేందుకు గదే లేకపోయిందా!" అన్నాడు యజ్ఞదత్తు.

"ఉంది, కాని నేను క్రిందిగదిలో సుఖంగానే వుంటాను."

యజ్ఞదత్తు మరేమీ అన్లేదు. 'ఈమె మాటలు తెలివితక్కువమాటలుగా లేవే!' అనుకున్నాడు. అంతేకాదు, 'ఈమె పీడాకారీ కాదు, రాక్షసగణమూ కాదు. అంతా శుద్ధ అబద్ధమే అయినా, నిజం చెప్పటం యెట్లా?' అనుకున్నాడు. ఈమె ఇంటికి

వెళ్ళిన తర్వాత తాను పూర్వం వున్నప్పటికీ యిక వుండబోయేదానికీ తేడాలేకుండా వుండగల్గుతుం దన్న విశ్వాసంకూడ లేకపోయిం దతనికి.

మరదలు రావటం సురమ చూచింది. మొదటి పొంగు తీవ్రతను తమాయించుకొని కుదుటబడింది. అందువల్ల మరదలిని చూడటానికి ఆమె వేగిరపడ లేదు. శాంతంగా గంభీరంగా ఆప్యాయంగా మాట్లా డింది. నోటిమాటలరూపంలో కాక అంతరంగంలోని శుభాకాంక్ష ఆమె కళావిహీనముఖంలో మళ్ళీ కాంతిని తెచ్చింది. "మరదలా, అక్కడ నీ ఆరో గ్యం బాగుండలేదా ?" అని అడిగింది.

కోడలు తలాడించి "అప్పుడప్పుడు జ్వరం వస్తూం డేది" అని చెప్పింది.

సురమ ఆమెనొసలుమీది ఘర్మబిందువులను తుడిచి "ఇక్కడ మందుపుచ్చుకుంటే బాగవు తుందిలే" అంది.

కోడలికోసం క్రిందిగది శుభ్రం చేయబడుతోం దని మధ్యాహ్నం సురమకు తెలిసింది. అవమా నంచే ఆమెకళ్ళు అశ్రుపూరితాలైనాయి. ఎలాగో వాటి నాపుకుంటూ ఆమె యజ్ఞదత్తువద్దకు పోయి "అన్నయ్యా! మరదలు క్రిందిగదిలో పడుకుంటుం దా ?" అనడిగింది.

యజ్ఞదత్తు పుస్తకంనీంచిదృష్టిని మరల్చకుం డానే "ఆమె అలాగే చెప్పింది" అన్నాడు.

"నువ్వేమీ చెప్పలేదా?"

"నే నేం చెపుతాను? ఎవరికి తోచినట్లు వాళ్ళు చేసుకోవచ్చు."

సురమ లజ్జ, ధిక్కారములచే తన్ను తాను సంబాళించుకోలేకపోయింది. అతనిముందే ఏడ్చి, అవతలికి వెళ్ళిపోయింది. పైన జరిగిన ఈ కీచులాట క్రిందికి తెలియనే లేదు.

కోడలు క్రొత్తగా గృహకృత్యాల్లో పాల్గొన సాగింది. క్రమంగా ఆమె సురమ బాధ్యతలన్నీ తానే వహించింది. కేవలం పైకిమాత్రం వెళ్ళేది కాదు. భర్తను కలుసుకొనేది కాదు. మెల్లమెల్లగా సురమ పైకి వెళ్ళటం తగ్గించింది. కోడలు ప్రఫుల్ల హృదయంతో పనులు నిర్వహిస్తోంది. సురమ ప్రక్కనే కూర్చునేది. పనిచేయటంలో ఎంత సుఖమున్నదో, పని-పాటుల్లోపడి ఎంతటి దుఃఖాన్నైనా మెలా మర్చిపోవచ్చునో ఆమె గమనించుతూండేది. ఇద్దరిలో ఏ ఒకరూ అధికంగా మాట్లాడేవారు కాదు. అయినా పరస్పరానుభూతి క్రమంగా గాఢమవుతూనే వుంది.

కోడలికి అప్పుడప్పుడు జ్వరంవస్తుండేది. మూడు

నాలుగు రోజులు లంఘనాలుచేయడంతో తగ్గిపో తూండేది. ఆమెకు మందుతినాలనే లేదు; తినేదీ కాదు. అలాంటప్పుడు దాస - దాసీలే ఆమెచేసే పనులు నిర్వర్తించేవారు. ఆ పనులు సురమవల్ల కాగలిగేవి కావు. చెయ్యాలనుకున్నా అవి ఆమె శక్తికి మించినవి.

ఇప్పుడు స్వర్ణమూర్తి సురమాదేవి దేహంలో ఆ వర్ణమూలేదు, ఆ కాంతీలేదు. ఆ లావణ్యమంతా యీ రెండునెలల్లోనే ఎగిరిపోయినట్టయింది! మర దలు అపుడపుడు "ఒదినా,నువ్వు రోజురోజుకు అలా అయిపోతున్నా వేమిటి?'' అని పరామర్శించేది.

"నేనా ? మరి, ఒదినా, ఆరోగ్యం కుదుటబడ టానికి నే నెక్కడికైనా వెళ్ళితే నీ కేమీ కష్టం కలుగదుగదా?" అని సురను అడిగింది ఒకసారి.

"తప్పకుండాను. ఎందుకు కలుగదు?''

"అయితే వెళ్ళనులే.''

"కాదు ఒదినా, నువ్విక్కడే మందు-మాకులు పుచ్చుకొని బాగుచేయించుకో.''

సురమ వాత్సల్యంతో ఆమె లలాటాన్ని ముద్దు పెట్టుకున్నది.

ఒక రోజున సురమ యజ్ఞదత్తుకి భోజనంవడ్డించు తోంది. యజ్ఞదత్తు ఆమె కళావిహీనముఖాన్ని

తదేకంగా చూస్తున్నాడు. సురమ తలెత్తి చూడ గానే అతడు దీర్ఘ నిశ్వాసంతో "నేను చచ్చిపోతే బాగుండుననిపిస్తోంది" అన్నాడు.

"ఎందుకని?" అంటూండగానే సురమ కళ్ళు అశ్రుపూరితాలైనాయి.

"ఇంకెన్నాళ్ళీ మొండిప్రాణాన్ని భరించాలోనని భయంగా వుంది."

తుపాకి గుండు తగిలిన అడవిమృగము నేల విడిచి పైకెగిరి యావచ్ఛక్తితో ఎలాపారిపో ప్రయత్నించుతుందో, కాని పైన ఆశ్రయంలేక చావ గొట్టబడిన ఆప్రాణి తుదకు తన చిర ఆశ్రయమైన భూమిపైన పడి ప్రాణం విడచునట్లే, సురమ విలవిల లాడుతూ మొదట ఆకాశంవంక చూచి, తర్వాత నేలమీదపడి యేడ్వసాగింది. "యజ్ఞ అన్నయ్యా, క్షమించు. నేను నీకు శత్రువుని. సన్నెక్కడికైనా పంపించెయ్యి. నువ్వు సుఖపడు" అన్నది.

ఎక్కడ ఏదాసీ వచ్చిచూస్తుందో నన్న భయం కొద్దీ యజ్ఞదత్తు ఆమెనుచేయిపట్టుకొని చప్పునలేవ దీశాడు. ప్రేమతో ఆమెకన్నీరు తుడుస్తూ "ఛీ! చిన్నపిల్లలాగా ఇలా ఏడుస్తారా?" అన్నాడు.

కన్నీళ్ళు తుడుచుకొని సురమ చప్పున గదిలోకి వెళ్ళిపోయి, లోపల గడియవేసుకున్నది.

తరువాత ఒకనాడు సురమ మరదలిని దగ్గరకు తీసుకొని "మరదలా, అన్నయ్య నీతో ఎప్పుడైనా యేమేనా అన్నాడా?" అని అడిగింది.

"ఏమంటారు?" అన్న దామె సహజంగానే.

"అయితే మరి నువ్వాయనదగ్గరకు వెళ్లటం లేదే? నీకు వెళ్లాలనిపించటంలేదూ?"

కోడలికి మొదట్లో సిగ్గువేసింది. తర్వాత తల వంచుకొని "వెళ్లాలనే వుంటుంది. కాని వెళ్ళేందుకు వీల్లేదుగా!"

"ఎందుకనీ?"

"నీకు జ్ఞాపకం లేదూ?"

"లేదే!"

"అరె! నువ్వు మరచిపోయావు కాబోలు వదినా! నాది రాక్షసగణమూ, వారిది నరగణమూ కదూ?

"ఎవ రన్నారు?"

"వారే మేనత్తగారితో చెప్పారు. అందువల్లేగా_"

సురమ ఒక్కసారిగా రోమాంచిత అయింది. "ఇదిఅబద్ధం!" అంది.

"అబద్ధమా?"

కళ్ళు పెద్దవిచేసుకొని ఆమె సురమమొహం లోకి చూస్తూవుండిపోయింది. సురమదేహం మాటి

మాటికి గగుర్పొడుస్తోంది. "అబద్ధమే, శుద్ధాబద్ధం!" అన్నది.

"నాకు నమ్మకం కల్గటంలేదు వదినా! వారు అబద్ధం చెపుతారా!"

ఇంక సురమ ఓర్వలేకపోయింది. తన బాహువులు చాచి ఆమెను గట్టిగా ఆలింగనంచేసుకొని వెక్కివెక్కి యేడ్వసాగింది. "వదినా, నేను మహాపాతకిని" అన్నది.

మరదలు కౌగిలినుంచి తప్పించుకొని "ఎందుకల్ల వదినా!" అని అడిగింది.

"అబ్బ! ఇంక ఇప్పు డేమీ అడక్కు. నేను చెప్పలేను"

♦ ♦ ♦ ♦

సురమ తుపానువీచికలా యజ్ఞదత్తుముందుకువెళ్ళింది. "కోడలి నీవిధంగా మోసగించావా? అబ్బ! ఎంత మహా అబద్ధాలకోరువి నువ్వు!" అన్నది.

"ఏమిటే సురా?"

"నువ్వు మహాప్రవీణుడవు. ఛీ ఛీ, నీకు సిగ్గులేదూ?"

యజ్ఞదత్తు కేమీ బోధపడలేదు. తెల్లపోయి కటో క్తులు వింటున్నాడు.

"ఏమనుకొని పెళ్లిచేసుకున్నావ్? ఏమనుకొని ఆమెను వదిలేశావు? నాకోసమా? నాముహం చూస్తూ ఇలా మోసంచేస్తూ వచ్చావా!"

"సురమా పిచ్చిదానవయ్యావా యేం?"

"నేనా పిచ్చిదాన్ని? నీకంటె ఎక్కువే జ్ఞానముంది నాకు. అయితే నన్నెడికైనా పంపించెయ్యి" అంటూంటే సురమకళ్ళు రక్తిమ దాల్చాయి. వణకుతూ 'ఇంక ఒక్క రోజైనా యిక్కడ వుండను. ఛీ ఛీ!" అన్నది.

"ఏమిటి నువ్వనేది!" అని యజ్ఞదత్తు బిగ్గరగా అరిచాడు.

ఒక్క నిమిషంలో యజ్ఞదత్తుకు బుఱ్ఱలో భగ్గుమన్నట్టయింది. అకారణంగా తనఆత్మ బయటపడి యుద్ధానికి తొడచరచుతూన్న టనిపించింది. ఇంగితజ్ఞానశూన్యుడై బల్లమీది రూళ్ళకర్ర తీసి బిగ్గరగా అరుస్తూ "నేను అధముణ్ణి. ఒఠి మోసగాణ్ణి. అబద్ధాలకోరును. అందు కిదుగో ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాను."

అని యజ్ఞదత్తు బలంకొద్దీ రూళ్ళకర్రతో తన నెత్తి మీద కొట్టుకున్నాడు. తలపగిలి నెత్తురు కారసాగింది. సురమ అస్ఫుటస్వరంతో "అమ్మయ్యో!" అని స్పృహ తప్పి క్రిందపడిపోయింది. యజ్ఞదత్తు ఆమెను చూచాడు. తనకూ మొహమంతా రక్తమయమైంది. కళ్ళలోకూడ రక్తంచేరి అంతా అస్పష్టంగా కన్పడుతోంది. ఉన్మత్తుని లాగా "ఇప్పు డెందుకు?" అన్నంతలో వెనుకనుంచి ఎవరో పట్టుకున్నారు. వెనుదిరిగి చూస్తే తన భార్యే. ఏడుస్తూ "నువ్వు వచ్చావా?" అన్నాడు.

భుజంమీాద తల ఆన్చి మూర్ఛితు డయ్యాడు.

సురమ విసురుగా పైకిరావటం చూచి, కోడలు ఆశ్చర్యపడి, సందేహంతో మెదలకుండా వెనుకపాటున వచ్చి ద్వారంవద్ద తలుపువెనుక నుంచున్నది. ఆమె అన్నీ విన్నది; అంతాచూచింది. వాస్తవమంతా ఆమెకు సూర్య కాంతివలె స్పష్టమైపోయింది. ఆమె హృదయస్పదనంకూడ తీవ్రమైంది. కళ్ళముందు ఔగ్రక్రమ్మినట్టయింది.అయినా ఆ విపత్సమయంలో ఆమె తనభర్తను పట్టుకొని ఒడిలోకి తీసుకొన్నది.

## 9

ఆరురోజులకు బాగా తెలివివచ్చాక "అన్నయ్య కెలావుంది?" అని అడిగింది సురమ.

"బాగానే వున్నారు" అని చెప్పింది దాసి.

"నేను చూచి వస్తా" నంటూ సురమ లేచింది కాని, అలాగే వాలిపోయింది.

"మీా రింకా బలహీనంగా వున్నా రమ్మా. జ్వరం వస్తోంది కూడాను. లేవకండి. డాక్టరుగారు వద్దన్నారు" అని చెప్పింది దాసి.

సురమ తన్ను చూచేందుకు యజ్ఞఅన్నయ్య వస్తాడనీ మరదలు వస్తుందనీ అనుకున్నది. ఒకటి - రెండు-యిలా వారం గడిచిపోయింది. అయినా ఎవరూ రానూలేదు. అజాపజా తీసుకోనూలేదు.

ఇప్పుడు జ్వరం రావటంలేదుగాని, చాలాబలహీనంగా వుంది. ప్రయత్నించితే యిప్పుడు లేవగలదుగాని, స్వాభిమానావేశంవల్ల లేవాలనిపించనేలేదు.లోలోన కుళ్ళికుళ్ళి ఏడ్వసాగింది. కళ్ళుతుడుచుకొని తమ 'ఛాయా ప్రకాశ్ ల' కథనుగూర్చి ఆలోచించేది.

దీపకాంతి, దట్టమైనక్రీనీడలతో వారు ఆట నారంభించారు. ఇప్పుడు దీపకాంతి ఆరిపోతున్నట్టుగా వుంది. నెత్తిమీది సూర్యుడు పడమటికి వాలిపోయాడు. నీడ అస్పష్టమై పెద్దదవుతూ ప్రేతంవలె అస్థిపంజరంమాత్రంగా అయిపోయింది. ఆ నీడ, అజ్ఞాత అంధకారంలో అదృశ్యమైపోవడానికా అన్నట్లు మెల్ల మెల్లగా అటువేపు జరిగిపోతున్నది. ఏడ్చిఏడ్చి సురమ నిద్రపోయింది.

ఒంటిమీద వెచ్చగావున్న చెయ్యేసి ఎవరో "వదినా!" అని పిల్చినట్టుంది.

సురమ లేచి కూర్చున్నది. "ఇదేమిటి మరదలా!" అన్నది.

ఆమె కళ్ళెర్రగా వున్నై! మొహంలో కాంతిలేదు; పెదవులు నల్లబడి వున్నాయి. సురమ "ఏం, మరదలా! నీవలా వున్నా వేమిటి?" అనడిగింది మళ్ళీ.

"నా కేమైంది? నన్ను నువ్వే యీ యింట్లోకి తీసుకొచ్చావు. అంచేత నీతో చెబుదా మని వచ్చాను. వదినా, నాకు సెలవివ్వు; నేను వెడతాను——"

"ఏమిటమ్మా, ఎక్కడికి వెడతావు ?"

కోడలు సురమపాదాలపై తలపెట్టి నేలమీద పడుకున్నది."

ఆమె శరీరం కాలిపోతున్నట్లు సురమ తెలుసుకున్నది. "ఇ దేమిటి, నీకు తీవ్రంగా జ్వరం వచ్చిందే" అన్నంతలో దాసి ఒకతె అరచుకుంటూ పరుగున వచ్చి "అమ్మగారు ! కోడలుగారు ఏరీ ? జ్వరంలో స్పృహతప్పి పరుగెత్తుకొచ్చారు. ఎనిమిది రోజులనుంచీ తెలివితప్పి పడివున్నారు. అమ్మో! యిక్కడి కెలా వచ్చారో!" అన్నది.

"ఎనిమిదిరోజులనుంచి జ్వరమా? డాక్టరుగారు వచ్చి చూస్తున్నారా?" సురమ అడిగింది.

"ఎవరూ చూడటంలేదమ్మగారూ! మొన్న ప్రొద్దున కూడ అమ్మాయిగారు గంటసేపు పంపుక్రింద తలపెట్టి కూచున్నారు. ఎంతవద్దన్నా విన్లేదు."

♦ ♦ ♦ ♦

సాయంత్రానికిముందు సురమ యజ్ఞదత్తుగదిలోకివెళ్ళి ఏడ్చింది: "అన్నయ్యా, ఇంక వదిన బ్రతకడం కష్టం" అని చెప్పింది.

"జీవించటం కష్టమా ! ఏం జరిగింది?"

"నాగదిలోకి వచ్చి చూడు అన్నయ్యా, ఇంక వదిన దక్కడం కష్టమే."

ఇద్దరు ముగ్గురు డాక్టర్లు వచ్చారు. 'ఆశలే'దని చెప్పే శారు.

రాత్రి తెల్లవార్లూ యజ్ఞదత్తు ఆమె తలాపినే కని పెట్టుకు కూర్చున్నాడు. ఎన్నోసార్లు మొహంలో మొహం పెట్టాడు. కాని, భార్య భర్తని గుర్తించనే లేదు.

డాక్టరు వెళ్ళిపోయిన తర్వాత యజ్ఞదత్తు ఏడ్చి మొత్తుకున్నాడు: ఒక్కసారి కళ్ళువిప్పిచూడు, ఒక్క మాట-''క్షమించానని చెప్పు'' అనడిగాడు.

సురమపాదాల చెంత మొహానికిగుడ్డకప్పుకొని "వదినా, ఎందు కిలా శిక్షించిపోయావమ్మా" అని విలపించింది.

సమాధాన మెవరిస్తారు? మానాభిమానాలను, అనా దర-తిరస్కారాలను తప్పించుకొని మెల్లమెల్లగా ఆమె ఈ లోకాన్నే త్యజించిపోయింది.

♦ ♦ ♦ ♦

"అన్నయ్య ఎక్కడున్నాడు?'' సురమ అడిగింది.

''నిన్న ఆయన షడమటి దిక్కుగా ఎక్కడికో వెళ్ళి పోయారు" అని దాసి చెప్పింది.

''ఎప్పుడొస్తాడు?"

''తెలియదు. బహుశా తొందర్లో రారేమొ !"

"నే నెక్కడుంటాను?''

"కావలసినంత డబ్బు తీసుకొని మీ కిష్టమైనచోట వుండమని చెప్పమని గుమాస్తాగారితో చెప్పి వెళ్ళారు."

సురమ ఆకాశంలోకి చూచింది - జగజ్జ్యోతి ఆరిపోయింది. సూర్యుడూ లేడు. చంద్రుడూ లేడు. ఒక్క చుక్కైనా కన్పడటం లేదు. చుట్టుప్రక్కల చూచింది. ఆ అస్పష్టఛాయకూడ - ఎక్కడ మాయమైందో - కన్పడ లేదు. నలువైపులా గాఢాంధకారమే. ఆమె హృదయ స్పందనంకూడ ఆగిపోతున్నట్టుంది. నయనజ్యోతికూడ మ్లానమై చలనం కోల్పోతున్నట్టుంది.

దాసి పిల్చింది - "అమ్మగారూ!" అని.

సురమ పైకిచూస్తూ కేకపెట్టింది-"యజ్ఞ అన్నయ్యా!" అని. అంతే, ఆ తర్వాత ఆమె మెల్లమెల్లగా వొరిగి పడి పోయింది.

——•••——

# అనుపమ ప్రేమ

## విరహము

పదకొండేళ్ళ వయస్సునుంచీ నవలలు తెగచదివి అనుపమ బుర్రపాడుచేసుకున్నది. మానవహృదయంలో ఉండగలిగినంత ప్రేమ, మాధుర్యము, శోభ, సౌందర్యము—అన్నిటినీ ఏరి ఏరి ప్రోగుచేసి తన మస్తిష్కంలో కూడబెట్టుకున్నట్లు మానవచరిత్ర, మానవస్వభావము తనకు కరతలామలకమని భావించుతోంది. ఇంక ప్రపంచంలో తాను నేర్చుకోవలసినది లేదనీ, అంతా తెలుసుకున్నాననీ, నేర్చుకున్నాననీ అనుకుంటున్నది. పాతివ్రత్యజ్యోతిని తాను చూచినట్లు, ప్రణయమహిమను తాను గ్రహించినంతగా ఈ లోకంలో ఇంకెవరికీ తెలియదనే ఆమె నిశ్చితాభిప్రాయం. తా నొక మాధవీలతననీ, తీగలు వేస్తున్న ఈ అదనులో వెంటనే ఏ శాఖనో అల్లుకోకుండావుంటే త్వరలో వికసించనున్న మొగ్గలు ఏవిధంగానూ సంపూర్ణంగా విచ్చలేవనీ ఆమె తలంచుతున్నది. కాబట్టి అన్వేషించి మనసుకు నచ్చిన వరుని ఎంచుకున్నది. మూడు నాలుగు రోజులలోనే అతనికి హృదయము, మనసు, జీవితము, యౌవనము—సమస్తము అర్పించివేసింది. మనసుల్లో ఇచ్చిపుచ్చుకోవటానికి అందరికీ సమాన హక్కు

వుంది. కాని జంటగా అంటుకొనేముందు సహకారి ఇష్టా యిష్టముల అవసరంకూడ వుంటుంది. అక్కడే మాధవీలత కొంచెం చిక్కులో పడింది. నూతన మేఘకాంతునికి తా నతని మాధవీలతనేననీ, పుష్పోన్ముఖినై నిలబడివున్నాననీ, తన కాశ్రయ మివ్వనిచో తాను మొగ్గలతోసహా నేల కూలి ప్రాణత్యాగం చేస్తాననీ చెప్పడం ఎలా!

కాని సహకారుడు ఇదంతా తెలుసుకోలేకపోయాడు. ఎరుగకుండె మానె—అనుపమ ప్రేమ దినదినాభివృద్ధి చెందుతూనే వుంది. అమృతంలో హాలాహలము, సుఖం లో దుఃఖం, ప్రణయంలో విచ్ఛిత్తి, చిరప్రసిద్ధములేగద. రెండుమూడు రోజుల అనంతరం అనుపమ విరహవేదనతో శిథిలావస్థలో పడి, మనసులో అనుకున్నది—"స్వామీ! నువ్వు నన్ను చేపట్టినా లేకున్నా, నావంక చూచినా చూడకపోయినా నేను శాశ్వతంగా నీ దాసీనే. ప్రాణం పోయినా సమ్మతమేగాని, నిన్నేవిధంగాను వదలిపెట్టను. ఈ జన్మలో కలియకపోయినా మరుజన్మలో తప్పకుండా లభించుతావు. అప్పుడైనా చూస్తావు — ఈ పతివ్రతా సాధ్వి చిరుబాహువుల్లో ఎంతశక్తి వున్నదో!"

అనుపమ గొప్పయింటి పిల్ల. వారియింటి నానుకొని ఉద్యానవనంకూడా ఉన్నది. అందులో సుందర సరోవరం కూడాను. అందు చంద్రు డుదయించుతాడు; కమల ములు వికసించుతాయి; కోయిలలు "కూకూ" అని

కూస్తాయి; తేనెటీగలు రొదచేస్తుంటాయి. అక్కడ విహరించుతూ ఆమె విరహం అనుభవిస్తోంది. జుట్టు విరబోసుకొని, భూషణాలంకారములు తీసివేసి, దేహానికి దుమ్ము కొట్టుకొని, ప్రేమసన్యాసినియై ఒకప్పుడు సరోవరజలంలో మొహంచూచుకొంటుంది. మరొకప్పుడు నయనాశ్రుజలంతో వక్షస్థలాన్ని తడుపుతూ గులాబిని ముద్దిడుకొంటుంది. వేరొకప్పుడు చెట్టుక్రింద చెంగు పరచి పడుకొని దీర్ఘనిట్టూర్పులు వదులుతూంటుంది. భోజనం సయించదు. నిద్రించాలని వుండదు. అలంకారం, శృంగారం అంటే విరక్తి. ఉబుసుపోక సంభాషణలయం దయిష్టము—ఈ విధంగా అనుపమ రోజురోజుకు ఎండి పుల్లయిపోసాగింది. అది చూచి ఆమెతల్లికి దిగులు పట్టుకున్నది. ఒక్కగాను ఒక్కపిల్ల—ఏమైంది ఈ పిల్లకి? అడిగితే ఆమె చెప్పే సమాధానం ఎవరికీ తెలియదు. నోట్లోమాట నోట్లోనే లుప్తమైపోతుంది. అనుపమ తల్లి ఒకనాడు జగద్బంధు బాబుతో యిలా చెప్పింది—"వింటున్నారా, పిల్లవిషయమే పట్టించుకోరాయె? మీకు ఒక్కతెతప్ప ఇంకోపిల్ల లేదుగదా! అది చికిత్సలేక ఏమైపోతోందో చూడండి!"

"అమ్మాయికి ఏమైంది?" అన్నాడు జగద్బంధుబాబు.

"అదేమిటో తెలియదు. డాక్టరుగారు చూచి పిల్ల కేజబ్బూ లేదన్నారు. మరి యిలా అయిపోతున్న దెందువల్లనో?"

"అది నా కేం తెలుస్తుంది?" అన్నాడు జగద్బంధు బాబు కొంచెం కోపంగా.

"అయితే మన అమ్మాయి చచ్చిపోవాల్సిందేనా?"

"ఇది చాలా కష్టమైన సంగతే. జ్వరమూ లేక, ఏ రోగమూ లేక వూరకే యిట్టె చచ్చిపోతే నేను పట్టుకుని ఆపగలనా యేం?"

అంతట అనుపమతల్లి దిగులుతో పెద్దకోడలివద్దకువెళ్ళి "కోడలా, నా అనూ యిలా తిరుగుతున్న దెందువల్లనే?" అని అడిగింది.

"నే నే మెరుగుదును అత్తా?"

"మీరు మాట్లాడుకోరా?"

"లేదు."

ఇందుమీదట గృహిణి ఏడ్చింది. "అయితే యేం జరుగుతుంది? ఇలాగే తిండీ తిప్పల్లేకుండా, నిద్రలేకుండా పగలంతా తోటలో తిరుగుతూంటుందా? ఎన్నాళ్ళు బ్రతుకుతుంది యిలాగైతే? మీరు దాని కెలాగైనా నచ్చజెప్పి దారికి తీసుకురండమ్మా. లేకపోతే నే నే చెరువులోనో పడి చస్తాను" అన్నది.

పెద్దకోడలు కాసేపు ఆలోచించి "ఎక్కడో సంబంధం చూచి పెళ్ళిచేసెయ్యండి అత్తా. సంసారభారం నెత్తిమీద పడితే దారికొచ్చేస్తుంది" అని చెప్పింది.

"సరే, నే నీ సంగతి యివాళే వారితో చెపుతాను."

అనుపమతండ్రి ఈ సంగతి విని నవ్వుతూ, "కలికాలం గదూ! చేసెయ్యి. పెళ్ళిచేస్తే బాగుపడుతుందేమో, అదీ చూడు" అన్నాడు.

మర్నాడే పెళ్ళిళ్ళ పేరయ్య వచ్చాడు. అనుపమ కల వారిబిడ్డ అయ్యె. రూపవతి కూడానా, మరి యోగ్యులైన వరుల కేం కొదువ? వారం తిరక్కుండానే పేరయ్య మంచిసంబంధం చూచి, జగద్బంధుబాబుతో చెప్పాడు. ఆయన ఈ సంగతి భార్యతో చెప్పాడు. గృహిణి పెద్ద కోడలితో చెప్పింది. క్రమంగా అనుపమకీ తెలిసింది.

ఒకటి రెండురోజుల అనంతరం ఒకనాటి మధ్యాహ్నం అందరూ కూర్చుని అనుపమ పెళ్ళివిషయమే మాట్లాడు తున్నారు. ఇంతలో జుట్టు విరబోసుకొని ఒక చేతిలో గులాబిపువ్వు పుచ్చుకొని శిథిలవసనయై అనుపమకూడ ప్రతిమలాగా అక్కడికి వచ్చింది. అనుపమతల్లి కూతురును చూచి చిరునవ్వునవ్వి "అమ్మాయ్, నాలాగే యోగినివై పోయావు!" అన్నది.

పెద్దకోడలు నవ్వుతూ అన్నది — "పెళ్ళయిపోతే యిదంతా గాలిలో యెగిరిపోతుంది. మరి, ఒక రిద్దరు పిల్లలు కలిగితే యిక అడగనే అక్కర్లేదు."

అనుపమ చిత్రంలాగా నిలబడి అన్నీ వింటోంది. కోడలు మళ్ళ "అత్తా, మరదలుపెళ్ళిలగ్నం యెప్పుడు నిశ్చయించారు?" అని అడిగింది.

"ఇంకా లగ్నం నిశ్చయం కాలేదు."

"వరుడు ఏం చదువుతున్నాడో?"

"బి. ఏ చదువుతున్నాడు"

"అయితే మంచి పెళ్ళికొడుకే దొరికాడూ!"

తర్వాత పెద్దకోడలు నవ్వి పరిహాసంగా "కాని చూడటానికి అందంగా లేకపోతేమాత్రం మామరదలికి నచ్చడండోయ్!"

"ఏం, ఎందుకు నచ్చడు? అల్లుడు చూడటానికి చాలా బాగున్నాడు."

అప్పుడు అనుపమ మెడ వంకరగాపెట్టి కొంచెం వంగి కాలిగోళ్ళతో నేలమీద గీస్తూ "నేను పెళ్ళిచేసుకోను" అంది మెల్లగా.

తల్లి ఆమాట సరిగావినిపించక "ఏమిటే అమ్మాయ్! నువ్వన్నది?" అనడిగింది.

పెద్దకోడలు అనుపమమాట విన్నది. ఆమె బిగ్గరగా నవ్వింది. "మామరదలుగారు పెళ్ళిచేసుకోనని చెపుతోంది."

"పెళ్ళి చేసుకోదూ?"

"ఉఁ హూఁ"

"చేసుకోదుటే" అని అనుపమతల్లి మూతివిరుస్తూ లోలోన ముసిముసినవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళిపోయినతర్వాత పెద్దకోడలు "పెళ్ళిచేసు

కోవూ!'' అని మరదలిని అడిగింది.

అనుపమ అంతకుముందులాగే గంభీరంగా ''ఏమైనా సరే చేసుకోను'' అని చెప్పింది.

"ఎందువల్ల?"

"ఎవరో ఒకరి మెడకి అంటగట్టడమే వివాహం కాదు. మనసులు కలియకుండా పెళ్ళి చేసుకోవడం తప్పు.''

పెద్దకోడలు ఆశ్చర్యాన్వితయై అనుపమ మొహం వంక చూస్తూ అన్నది— ''మెడకి అంటగట్టడమని దేన్ని అంటారండీ? తల్లిదండ్రులు ఎవరికో ఒకరికి అప్ప గించకపోతే ఆడపిల్లలు స్వయంగానే వెతికి తెచ్చుకుని పెళ్ళి చేసుకుంటారా యేం?"

''తప్పకుండాను.''

''అయితే నీవుద్దేశ్యంలో నా పెళ్ళి తప్పనేగా? పెళ్ళికి ముందు మీ అన్నయ్య పేరే నేను విన్లేదే.''

''అందరూ నీలాంటివారేనా!"

పెద్దకోడలికి మళ్ళీ నవ్వొచ్చింది. ''ఇంతకీ నీ మన సుకు నచ్చిన అబ్బాయి ఎవరైనా దొరికాడా యేం?"

అనుపమ తన వదినె అన్న యీ వ్యంగ్యోక్తితో మరింత గాంభీర్యత వహించి ''వదినా! ఎగతాళిచేస్తా వెందుకు? ఇది పరిహాసానికి తగిన సమయమేనా?" అన్నది.

"ఏఁ, ఏం జరిగింది?"

ఏం జరిగిందో వినండి—అనుపమను తనపతిని తన ఎదుటనే వధింపబడుతున్నట్లనిపించింది-తక్షణ కతల్ ఖాను కోటలో వధపీఠం ముందు విమలా వీరేంద్ర సింహుల దృశ్యమామెకళ్ళముందు కొచ్చింది. "వారు చేసినట్లు నేను చేయలేనా? పతివ్రత ప్రపంచంలో ఎవరికి మాత్రం భయపడుతుంది?" అని ఆలోచించుకుంటున్న అనుపమకళ్ళలో చూస్తూచూస్తుండగానే ఏదో అస్వా భావిక తేజస్సు తళుక్కుమన్నది. చూస్తుండగానే ఆమె చెంగుతో నడుంబిగించుకొన్నది. ఇదిచూచి పెద్దకోడలు నాలుగుఅడుగులు వెనక్కి తగ్గింది. క్షణంలో అనుపమ సమీపంలోని మంచంకోడును కౌగలించుకొని పైకి చూస్తూ బిగ్గరగా అరుస్తూ అంటున్నది—"ప్రభో, స్వామీ, ప్రాణనాథా; లోకంముందు నేడు నేను నిన్నే నా ప్రాణనాథునిగా స్వీకరించుతున్నాను. ప్రభో, నువ్వు నావాడివి, నేను నీదానను. ఇది మంచంకోడు కాదు. ప్రభూ, ఇది నీపాదపద్మయుగళము. నేను ధర్మమే సాక్షిగా నిన్ను పతిగా వరించుతున్నాను. నీపాదాలు స్పృశించి చెప్తున్నాను— ఈ ప్రపంచంలో నీవుతప్ప ఇంకెవ్వరూ నన్ను స్పృశించలేరు. ప్రాణముండగా మనల నిద్దరినీ వేరుచేయగల శక్తి ఎవరి కున్నది? అమ్మా, అమ్మా, జగజ్జననీ!—"

పెద్దకోడలు బయటికి పరుగెత్తుకొని వెడుతూ కేకలు

పెట్టింది— "ఏమండోయ్, చూడండి, మరదల్కు కేమైందో చూడండి, రండి" గృహిణి పరుగెత్తుకొచ్చింది. కోడలి ఛీత్కారం బయటికికూడా వినపడింది. 'ఏమైంది, ఏమైంది!' అంటూ జగద్బంధుబాబు, వారి పెద్దకొడుకు చంద్రబాబు గబగబ వచ్చారు. తండ్రీ-తల్లీ, కొడుకు-కోడలూ, దాస-దాసీజనంతో గది నిండిపోయింది. అనుపమ స్పృహతప్పి మంచంకోడువద్ద పడిపోయివున్నది. తల్లి ఏడ్పు సాగించింది— నా అనూకి ఏమొచ్చిపడింది! డాక్టరును పిలిపించండి. నీళ్ళు తెండి, నీళ్ళు. విసరండి!— ఈ గోల విని చుట్టుప్రక్కలవాళ్ళు చాలమంది పోగయ్యారు.

చాలాసేపైనతర్వాత అనుపమ కళ్ళు విప్పి మెల్లగా "నే నెక్క డున్నాను!" అన్నది. తల్లి కూతురు మొహంలో మొహంపెట్టి ప్రేమతో "ఏం అమ్మాయ్, నువ్వు నా ఒడిలోనే వున్నావుగా" అంది. అనుపమ ఒక దీర్ఘ నిట్టూర్పు వదలి నెమ్మదిగా అన్నది— "నేను వారితో కలిసి ఏదో స్వప్నలోకంలో విహరించుతున్నా ననుకొన్నాను" ఆమె చెక్కిళ్ళమీదుగా అశ్రుబిందువులు టపటప రాలుతున్నవి. వాటిని తుడిచివేస్తూ ఆమె జనని కాతరస్వరంతో "కన్నీళ్ళు పెడుతున్నా వెందుకు తల్లీ? ఎవరిసంగతి నువ్వు చెప్పేవి?" అని అడిగింది.

అనుపమ దీర్ఘశ్వాస వదిలి మౌనందాల్చింది. పెద్ద

కోడలు చంద్రబాబుని ఒకప్రక్కకు పిల్చి "అందరినీ వెళ్ళిపొమ్మని చెప్పండి. ఇంక భయమేమీ లేదు. మఱదలు బాగానే వుంది" అని చెప్పింది. అంతా వెళ్ళిపోయారు. ఆ రాత్రి పెద్దకోడలు అనుపమదగ్గరకు వచ్చి కూర్చున్నది. ''నీ కెవరితో పెళ్ళయితే సుఖపడతావమ్మా'' అని అడిగింది.

అనుపమ కళ్ళు మూసుకొని "నాకు సుఖ-దుఃఖాలనేవి లేవు. ఆయనే నా భర్త—"

"అది నాకు తెలిసిందిలే. కాని ఆయన ఎవ రేమిటి?''

'సురేశ్! సురేశ్—''

''సురేశా? రాఖాల్ మజుందారిగారి అబ్బాయా?''

"ఆఁ, ఆయనే."

అనుపమతల్లికీ సంగతి ఆ రాత్రే తెలిసింది. మరునాడే ఆమె వారియింటికి వెళ్ళింది. మాటలసందర్భంలో సురేశుతల్లితో యిలా అన్నది— "మీ అబ్బాయికి మా అమ్మాయిని చేసుకోండమ్మా''

సురేశ్ తల్లి "మంచిదేగా!'' అని నవ్వింది.

"మంచిదేనంటే కాదు, నువ్వీ సంబంధం ఒప్పుకోవాల్సిందే."

"ఒకసారి సురేశ్‌ని కనుక్కోనీ. వాడు ఇంటివద్దే వున్నాడులే. వాడు ఒప్పుకుంటే వాళ్ళ నాన్నగారు కాదనలేరులే"

సురేశ్ ఇప్పుడు ఇంటివద్దే బి. ఏ. పరీక్షకు చదువుతున్నాడు. ప్రతి నిమిషము అతని కొకసంవత్సరంలాగున్నది. తల్లి పెళ్ళి సంగతి చెప్తే విన్పించుకోనేలేదు. తల్లి "అబ్బాయ్, నువ్వు పెళ్ళి చేసుకోవాలిరా" అన్నది మళ్ళీ.

సురేశ్ మొహమెత్తి "ఆఁ, అది సరేలే; కాని యిప్పుడేం తొందరవచ్చింది? చదువుకునేటప్పుడు యిలాంటివి బాగుండవు" అన్నాడు.

తల్లి కొంచెం చిన్నపుచ్చుకుని అన్నది— "యిప్పుడే కాదులేరా అబ్బాయ్. పరీక్ష అయిపోయిన తర్వాతే జరుగుతుందిలే."

"ఎక్కడ ?"

"మన వూళ్లోనే, జగద్బంధుబాబు కూతురు."

"ఏమిటీ ! చందూ చెల్లెలా ? అతను 'లల్లీ, – బాల్లీ' అని పిలుస్తాడే, ఆమేనా ?"

"లల్లీ కాదురా. అనుపమరా."

సురేశ్ నవ్వుతూ 'ఆఁ, అనుపమ! ఛీ, ఛీ! చూడ్డానికే వికారంగా వుంటుంది."

"వికారమేమిటిరా, చూపుల కెంత చక్కగా వుంటుందీ !"

"చూపులకు బాగున్నాసరే, ఇంటిపక్కనే అత్తవారిల్లా ! నా కిష్టంలేదు."

"అయితేమాత్రం ఇందులో చెడేముందీ?"

"చెడుసంగతి అలావుంచు. నువ్వు వెళ్లూ. నే విప్పుడు చదువుకోవాలీ. చాలా చదవాల్సింది వుంది. ఇక వెళ్ళు."

సురేశ్ తల్లి తిరిగివచ్చి "సురేశ్ వున్నవూళ్లో సంబంధంచేసుకోవటానికి సుతరామూ ఒప్పుకోవటం లే''దని చెప్పింది.

"ఏం?"

"నా కేమీ తెలియదమ్మా"

అనుపమ తల్లి మజుందారుభార్యచేతులు పుచ్చుకొని "అలాకాదు ఒదినా! నువ్వీపెళ్ళి ఏలాగైనా చేసి తీరాలి" అని బ్రతిమాలింది.

"పిల్లవాడు యిష్టపడనిదే నే నేంచేయగలను? చెప్పు?"

"చేయించకపోతే నే నూరుకోను వదినా!"

"అయితే చూద్దాంలే. రేపు మళ్ళీ చెప్పిచూస్తాను. ఒప్పుకుంటే సరి."

అనుపమతల్లి యింటికివచ్చి జగద్బంధుబాబుతో "మజుందారుగారి సురేశ్ తో నా అనూపెళ్ళి చేసితీరాలండీ, ఎలాగైనా సరే, యీ సంబంధం ఖాయపర్చండి."

"ఇదేమిటే? రామ్ గ్రామ సంబంధం దాదాపునిశ్చయమైనట్లేగా. ఆ సంబంధాన్ని యెందుకు వదలుకోవాలి?"

"కారణం వుంది లెండి"

"ఏమిటె?"

"ఏమ రేంలేదు; సురేశుని వంటి రూపవంతుడు గుణవంతుడు దొరకడం కష్టం. అదీగాక నా కున్నది ఒక్కగాని ఒక్కపిల్ల. మరి దూరాన ఎలా యిస్తాను చెప్పండి, సురేశ్ తో అయితే వూళ్ళోనేగా, కళ్ళముందు వుంటుంది"

"సరే, ప్రయత్నించుతాను."

"ప్రయత్న మేమిటి? చేసితీరాలి"

భార్యధోరణి చూచి జగద్బంధుబాబుకి నవ్వొచ్చింది. "తప్పకుండా చేస్తాలే" అన్నాడు.

సాయంత్రం జగద్బంధుబాబు మజుందారుగారియింటి నుంచి వచ్చి "పెళ్ళి జరగదు" అని చెప్పాడు భార్యతో.

"ఏం, ఏం జరిగింది?"

"ఏంచెయ్యను చెప్పు? వారు ఒప్పుకోనిదే నేను బలవంతంగా పిల్లను వారియింటో పారవేసిరాలేనుగద!"

"ఏం, ఎందుకని ఒప్పుకోలేదు?"

"వున్నవూళ్ళో సంబంధం వారి కిష్టంలేదు"

"నాపారబ్ధం!" అని అనూతల్లి చేత్తో నొసలుమీద కొట్టుకున్నది.

మర్నాడు మళ్ళీ ఆమె సురేశ్ తల్లివద్దకు వెళ్ళి"నువ్వేలాగైనా జరిపిస్తేకాని వీల్లేదు వదినా!" అన్నది.

"నా కిష్టమేగాని, అబ్బాయి ఒప్పుకోనిదే యేంచెయ్యను వదినా?"

"నేను చాటుగా సురేశ్ కి మరో అయిదువేల

రూపాయలు యిస్తాను వదినా"

ధనాశకు మించిన కాంక్ష లేదు. సురేశ్ తల్లి ఈ సంగతి భర్త చెవిని వేసింది. ఆయన కొడుకును పిల్చి "సురేశ్ ను వీ సంబంధానికి ఒప్పుకోవాల్సిందేరా" అని చెప్పాడు.

"ఎందువల్ల?"

"మీ అమ్మ కావాలంటున్నది. నేనూ యిష్టపడ్డాను. పైగా యింకో కారణంకూడా వుంది."

సురేశ్ క్రిందికి చూస్తూ "ఇంకా చదువుకోనేరోజులు నాన్నగారూ! పరీక్షకి దెబ్బతగులుంది" అన్నాడు.

"అది నాకూ తెలుసురా అబ్బాయ్. నీ పరీక్ష పాడు చేసుకోమంటానా? పరీక్షఅయిన తర్వాతే పెళ్ళవుతుంది"

"అయితే మీ యిష్టం"

అనుపమతల్లి ఆనందానికి మేరలేదు. ఆమె ఈసంగతి భర్తతోను, నౌకర్లు, దాసీలు- అందరితోను చెప్పేసింది. పెద్దకోడలు అనుపమని పిల్చి "విన్నావా మరదలా, నీ వరుడు వల్లో చిక్కాడులే" అన్నది.

అనుపమ సిగ్గుతో ముసిముసినవ్వు నవ్వుతూ "నాకు ముందే తెలుసు" అంది.

"ఎలా తెలుసు? ఉత్తరా లేమైనా రాసుకున్నారా?"

"ప్రేమ అంతర్యామి. మా వుత్తరాలు మనసుల్లోనే జరుగుతుంటాయి."

"మరదలా, నువ్వు ధన్యవమ్మా!"

అనుపమ వెళ్ళిన తర్వాత పెద్దకోడలు మెల్లగా అనుకున్నది—ఈవయసులో చిన్ననోట పెద్దమాటలు వింటే ఒళ్ళుమండుకొస్తుంది. ముగ్గురుపిల్లలతల్లిని—నా కీబిడ్డ ప్రేమ నేర్పుతుందా!

ప్రేమ పరిణామం.

దుర్లభవసువు తగినంత సంపద్భాగ్యాలు వదలి పరలోకగతుడయ్యాడు. ఆయన ఏకైకపుత్రుడు—ఇరవై యేళ్ళ లలితమోహనుడు తండ్రి శ్రాద్ధకర్మలు పూర్తిచేసి ఒకరోజున స్కూలుకు వెళ్ళి "మాస్టరుగారూ, నాపేరు కొట్టివెయ్యం"డని చెప్పేశాడు.

"ఏం, సంగతేమిటి?"

"వ్యర్థంగా చదివి యేం లాభం? దేనికోసం చదువుతారో అది నాకు చాలావుంది. మా నాన్నగారు చదువుకోని, నాకు చాలినంత సంపాదించి యిచ్చిపోయారు."

మాష్టరుగారు కళ్ళు మిణకరించి నవ్వుతూ "అయితే నీకింక చింత ఏముంది? సరదాగా తిని తిరుగూ!" అన్నాడు.

ఇక్కడే లలితమోహన్ చదువుకి స్వస్తి జరిగింది.

లలితమోహన్‌కి మంచిచెడలు తెలియని వయసులో చేతినిండా డబ్బు! కాబట్టి బడిపదలిపెట్టగానే తగిలినంతమంది స్నేహితులు సమకూడారు. తర్వాత క్రమంగా

సిగరెట్లు, భంగు, గంజాయి, మధుపానం, డ్యాన్సులు మొదలైనవి ఒకటొకటిగా అతని కొలువుకూటంశోభను వృద్ధిచేయసాగాయి. తండ్రి కూడబెట్టినధనం నీళ్ళలాగా అలలులేస్తూ మహాజోరుగా సాగరంవేపు ఉరకలు వేయ సాగింది. తల్లి ఏడ్చి మొత్తుకొని ఎన్నోవిధాల చెప్పి చూచింది కాని, అతను విననేలేదు.

ఒకరోజున అతడు తిరుగుతున్న ఎగ్రటికళ్ళతో తల్లి వద్దకు వచ్చి "అమ్మా, నా కిప్పుడే ఒకయాభైరూపాయ లివ్వు" అని అడిగాడు. ఆమె తనవద్ద ఒక్క దమ్మిడి కూడ లేదని చెప్పివేసింది. లలితమోహన్ మాట్లాడ కుండాపోయి ఒకగొడ్డలి తెచ్చాడు. తల్లిపెట్టె పగుల గొట్టి యాభైరూపాయలూ తీసుకొని చక్కాపోయాడు. తల్లి అంతా చూస్తూన్నదేకాని, ఏమీ అనలేకపోయింది.

మరునాడే ఆమె ఇనప్పెట్టెతాళంచెవి కొడుకుచేతి కిచ్చి "అబ్బాయి, ఇదిగో ఇనప్పెట్టెతాళంచెవి. నీ తండ్రి గారి ధనం నీ యిష్టంవచ్చినట్టు ఖర్చుపెట్టుకో. ఇంక నే నేమీ మాట్లాడనులే. కాని, నేను వెళ్ళిపోయినతర్వాత అయినా నీకళ్లు తెరిపించమని దేవుణ్ణిప్రార్థించుతున్నాను" అని చెప్పింది.

కొడుకు విస్మితుడై "ఎక్కడికి వెళతావు?" అని అడిగాడు.

"ఏమో, ఆత్మహత్యచేసుకుంటే ఎక్కడికి వెళ్ళాలి

వస్తుందో తెలియదుగాని, సద్గతిలేదనిమాత్రం తెలుసు.
అయినా ఏం చేస్తాను చెప్పు? నా రాత అలావుంది !"

"ఆత్మహత్య చేసుకుంటావా ?"

"మరి గత్యంతర మేముంది? నిన్ను కడుపున కని అన్ని సుఖాలు పొందాను. ఇప్పుడింక రోజూ నీతో చెప్పు దెబ్బలు తినేకంటే యమలోకంలో అగ్నిగుండంమాత్రం ఏం తీసిపోతుందిలే."

లలితమోహనునికి తల్లిస్వభావం తెలుసు. తన తల్లి వుత్తుత్త బెదిరింపు బెదిరించేదికాదని అతనికి బాగా తెలుసు అతడు ఏడుస్తూ తల్లికాళ్లమీదపడి "అమ్మా, ఈసారికి నన్ను క్షమించు. ఇంకెన్నడూ ఇటువంటి పని చెయ్యను. నువ్వు వెళ్ళొద్దు, వుండు" అన్నాడు.

"అదెక్కడ జరుగుతుందిలే. నీ స్నేహితులంతా యెక్కడికి పోతారు?" అని తీవ్రంగా అన్నది.

"నాకెవరూ వద్దు. డబ్బూ - గిబ్బూ, స్నేహితులు మిత్రులూ—ఏమీవద్దు. నువ్వు వుంటే చాలు."

"నీ మాట నమ్మక మేమిటి?"

"ఏం అమ్మా, నేను ఎంత చెడ్డసంతానైనా, నే నెప్పుడైనా నమ్మకంలేనిపని చేశానా? నువ్విక్కడేవుండు. నువ్విచ్చినదానితో సంతోషంగా గడుపుతాను. అంత కంటె ఎక్కువ ఒక్క దమ్మిడీకూడ అడుగనుగా."

"సంతోషంగా నీకు ఒక్కకానీ యివ్వటానికూడా

యిష్టంలేదు. ఏడాది - పణ్ణారంలో నువ్వు ఖర్చుపెట్టినంత సొమ్ము నీ జీవితమంతట్లో నూకూడా సంపాదించలేవు. తెలిసిందా!"

"అయితే నువ్వసలేమీ యివ్వనే వద్దు."

తల్లి జాలిపడింది "వద్దులే. నీ వంతకష్టం సహించలేవు. నాకూ అలాంటికోరిక లేదు. నెలకి వందరూపాయలు సరి పోవూ?" అన్నది.

"ఓ, హాయిగా."

"అయితే యిదే ఖాయం."

ఒకటి రెండురోజుల్లో అతని మిత్రబృందం జారుకో సాగారు. లలితమోహనుడు ఒకరిద్దరిని యిళ్ళకుపోయి పిలిచాడు. 'ఇవాళ పని వుం'దని ఒకడు, "రేపు వస్తాలే" అని ఇంకొకడు సమాధానాలు చెప్పారు. ఇప్పు డతడు ఒంటరిగానే వుండిపోయాడు. ఒక్కడే మద్యం త్రాగు తున్నాడు, ఒంటరిగా తిరుగుతున్నాడు. ఇంక త్రాగ కూడ దనుకున్నాడు గాని, కాలం ఎలా గడుస్తుంది? కాబట్టి అది వదలలేదు. అతడు తరచుగా తిరుగుతూండే బాట జగద్బంధుబాబు ఉద్యానవనం ప్రక్కగానే పోతుంది. ఆ బాటలో జనసంచారం తక్కువ కాబట్టి త్రాగి తిరగటానికి అతని కదే వీలుగావుంది. త్రాగుబోతు కావటంవల్ల వూళ్ళో అతనికి చెడుపేరు పడింది. అంచేత ఎవరియింటికీ వెళ్ళడానికి యిష్టంలేక ఒక్కడే గుమ్మరు

తూండేవాడు.

ఇప్పు డతని కొకసహచరికూడ లభించింది—ఆమె అనుపమే. ఆ బాటనే అతడు వస్తూపోతూ తోటలోకి చూస్తూండేవాడు. అందులో అనుపమకూడ సంచరించు తూంటుంది. అనుపమను చిన్నప్పటినుంచీ చూస్తూనే వున్నాడుగాని, ఇప్పుడు దాని కాయములో ఏదో నూతనత్వం కనపడుతోంది. జగద్బంధుబాబు తోటగోడ ఒక చోట పడిపోయింది. అక్కడే ఒక చెట్టుక్రింద కూర్చుని చూస్తూండేవాడు. అనుపమ తోటలో అటూ యిటూ తిరుగుతూండేది. ఒకప్పుడే చెట్టుక్రిందనో కూర్చుని పూలమాల గుచ్చేది. మరొకప్పుడు పువ్వులు ఏరేది. వేరొకప్పుడు పాదాలు రెండూ సరోవరజలంలో ముంచి బాలికాసహజరీతిని క్రీడించుతూండేది. ఇదంతా చూస్తుంటే అతని కానందంగా వుండేది. చెదరిన శిరోజాలతో, గాలికి వదలిన దేహలత, అస్తవ్యస్తంగా వేసుకున్న వసనాలు, ఆభరణాలు—అన్నిటికీ మించిన ఆమె ముఖము త్రాగిమత్తిల్లిన అతనికళ్ళకు వికసించినపద్మంలా కనపడేది. ప్రపంచంలో అనుపమను దర్శించుతూవుండటమే ఆతనికి అత్యంత యిష్టకార్యంగా తోచేది. రాత్రి యింటికి చేరి పడుకొనేవాడు. నిద్రపట్టేవరకు అతనికి అనుపమముఖబింబమే కనపడుతూండేది. స్వప్నంలోకూడ అనుపమ నిష్కళంక సుందరముఖారవిందమే ద్యోతమాన

మవుతూండేది. ఇలాగే చాలరోజులు గడచిపోయాయి. ఆ పడిపోయిన గోడదగ్గర ప్రతిసాయంత్రం కూర్చోవటం ఆతని నిత్యకృత్యమైంది. పిల్లవాడు కాదుగా. కాబట్టి కొద్ది రోజుల్లోనే తాను అనుపమను వాస్తవంగా అమితంగా ప్రేమించుతున్నానని గ్రహించుకున్నాడు. కాని—యిలాంటిప్రేమతో ఏం లాభం? తాను త్రాగుబోతుఅనీ, మూర్ఖుడనీ, అందరిచే అసహ్యించుకోబడినవాడననీ అతనికి తెలుసు. కాన అనుపమ కే విధంగాను తగననీ, ఎంత ప్రయత్నించినా ఆమెను పొందడం అసంభవమనీ అనుకున్నాడు. మరి ఈరీతిని వృథాగా మనసు పాడుచేసుకొని ఏం ప్రయోజనం? ఇక రేపట్నుంచీ అక్కడికి పోరాదనుకునేవాడు. కాని పోకుండా వుండలేకపోయేవాడు. సూర్యాస్తమయం కాగానే త్రాగి ఆ కూలిపోయిన గోడమీదికి చేరి పీఠంవేసేవాడు. కాని యిందులో ఒక రహస్యం వుంది. అది ప్రేమించినవారికే అర్థమవుతుంది. బహుశా ఆమెకూడ యిలాగే ప్రేమించుతున్నదేమో! ఎందుకు ప్రేమించకూడదు ? అయితే ఇది ఋజువుచేయడానికి వీలుకానిది!

♦ ♦ ♦ ♦

ఒకరోజున లలితమోహనుడు గోడమీద కూర్చోగానే చంద్రబాబు దృష్టి అతనిపై పడింది.

చంద్రబాబు తోటమాలిని పిల్చి...ని పట్టుకొ

మని చెప్పాడు. ఎవర్ని పట్టుకోవాలో మొదట వాడికి బోధపడలా. తర్వాత లలితమోహన్ బాబుని పట్టుకోవాలని ఆయనవుద్దేశ్యాన్ని గ్రహించగానే తోటమాలి సలాంచేసి రెండడుగులు వెనక్కి తగ్గి నుంచున్నాడు. చంద్రబాబు మళ్ళీ బిగ్గరగా అరచి చెప్పాడు—"...ని పట్టుకొని స్టేషనుకుతీసు కెళ్ళు." వాడాపని తనవల్లకాదని తటపటాయించాడు. ఈ లోగా లలితమోహనుడు గోడ దిగి మెల్లగా వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళిపోయినతర్వాత "ఎందుకు పట్టుకోలే"దని చంద్రబాబు తోటమాలిని గద్దించాడు. వాడేమీ మాట్లాడలేదు. నౌకరుకు లలిత మోహానుని సంగతి బాగా తెలుసు. వాడు అన్నాడు.— "ఈ భోజపురిలో లలితబాబుని పట్టుకొనే దెవరండీ! ఇలాంటి నౌకర్లను నలుగుర్ని ఒక్కదెబ్బతో పడుకో బెడతాడు. తోటమాలికూడ ఆమాట కాదనలేదు. "బాబూ, నౌకరీ చేయడానికి వచ్చాగాని ప్రాణం యివ్వటాని క్కాదు" అన్నాడు.

చంద్రబాబు అంతటితోనే వదులాడా? లలిత మోహాను డంటే .ఆయనకి మొదట్నుంచీ కోపం వుంది. ఇప్పుడు అవకాశం చూచి సాక్ష్యం వగైరా కూర్చుకొని తనతోటలో అనధికారప్రవేశంచేశాడని కేసుపెట్టాడు. తల్లి - చంద్రుడులిద్దరూ వద్దని ఎంత చెప్పినా విన్లేదు. ఇంక అవమానపీడితమైన అనుపమ ఆ పాపాత్ముడికి శిక్ష

వేయించనిదే తనమనస్సునకు శాంతిలేదని గట్టిపట్టుపట్టింది.

ఇన్స్పెక్టరు ఇంటికి వచ్చి అనుపమ వాఙ్మూలం తీసుకున్నాడు. అనుపమ అంతా సరీగ్గానే చెప్పింది. తుదకు వ్యవహారం ముదిరి, లలితమోహనునితల్లి యెంత డబ్బు ఖర్చుపెట్టినా కొడుకుని తప్పించలేకపోయింది. లలితమోహన్ కి మూడేండ్ల కఠినశిక్ష విధించబడింది.

♦ ♦ ♦

బి. ఏ. పరీక్షా ఫలితాలు ప్రకటింపబడినై. సురేశ చంద్ర మజుందారు ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు. ఊళ్లో గొప్పగా చెప్పుకున్నారు. అనుపమతల్లి దానికి హద్దే లేకపోయింది. ఆమె ఆ సంతోషంతో సురేశ్ తల్లివద్దకు వెళ్లి "ఎవరిసంగతివారు చెప్పుకోగూడదుకాని, మా అమ్మాయి అదృష్టం చూచావా వదినా!" అన్నది.

"అది చూస్తూనే వున్నాగా" అని సురేశుతల్లి నవ్వుతూ అన్నది.

"పెళ్ళి అయిపోనీ, నీకొడుకు రాజా కాకపోతే చూడు. అనూ పుట్టినప్పుడే ఒకజ్యోతిష్కుడు వచ్చి 'ఈ పిల్ల రాణి అవుతుంది. ఎవరూ పొందనంతగా సుఖపడు తుంది' అని చెప్పాడు"

"ఎవరూ చెప్పింది?"

"ఒక సన్యాసి."

"సరేకాని,ముందు నీ అల్లుడికిఒకయిల్లు యిప్పించు."

"ఓ, అలాగే. చంద్రాన్ని నాకడుపునపుట్టినవాడి లాగే చూస్తున్నా. నా అనూకి వాళ్ళనాన్నగారి ఆస్తిలో సగం ముట్టజెప్పా లనుంది. నేను బ్రతికివుంటే ఎలాగూ ముట్టితీరుతుంది."

"అలాగే జరగాలి, ఇద్దరూ రాజా-రాణీఅయిసుఖంగా వుంటూంటే చూచి మనం వెళ్ళిపోతాం."

రెండురోజుల తర్వాత రాఖాల్ మజుందారు కొడుకును చేరబిల్చి "నీ పెళ్లి ఈ వైశాఖమాసంలో నిశ్చయమైందిరా అబ్బాయ్" అని చెప్పాడు.

"ఇప్పుడే నాకు పెళ్ళవటం ఏమాత్రం యిష్టంలేదు నాన్నగారూ"

"ఎందువల్ల ?"

"నాకు గిల్‌క్రిష్ట్-స్కాలర్ షిప్పు వచ్చింది. దానితో నేను విదేశానికి వెళ్ళి చదువుకోవచ్చు"

"నువ్వు విదేశం వెళ్తావా !"

"కోరిక వుంది"

"చదివి చదివి నీ బుర్ర పాడైపోయింది. ఆ మాట మళ్ళీ అన్నావంటేనా !"

"ఖర్చు లేకుండానే ఇలాంటి అవకాశం లభించుతూంటే దోష మేమున్నది ?"

ఈ మాటతో రాఖాల్ బాబు మండిపడ్డాడు. "నువ్వు నా స్తినుడవురా. పైగా దోష మేమున్నదంటావా ? ఇత

ధులఖర్చుతో విషంలభించితే తినాల్సిందేనా ?'' అన్నాడు.

''దానికీ దీనికీ చాలా తేడా వున్నది.''

''ఎక్కడుంది తేడా? జాతిభ్రష్టుడై మ్లేచ్ఛుడవటం ఒకటికాక మరేమిటి?''

సురేశు యింకేమీ వాదించకుండా నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళినతర్వాత రాఖాల్ బాబు నవ్వుకొని తనలో తా ననుకున్నాడు—నాలుగు ఇంగ్లీషు ముక్కలు చదివేటప్పటికే మాతో వాదించటానికి తయారయ్యావా? ఎలాంటిమాట అన్నావురా! ఇతరుల ఖర్చుతో విషం దొరికితే తినవచ్చా? కుర్రకుంక! మళ్ళీ నోరెత్తలేకపోయాడు! హుఁ, నా యుక్తికి తిరుగున్నదా?'

పెళ్ళి ఖాయమైన తర్వాత పెద్దకోడలు అనుపమతో "ఊళ్ళో నీ వరుని పేరు మ్రోగిపోతూంది'' అన్నది.

అనుపమ మందహాసంచేసి ''అర్ధాంగి సాధ్వీమణి ఐతే అట్టివారికి ప్రపంచంలో సుఖద్వారాలు యావత్తూ తెరిచే వుంటాయి'' అంది.

"కాని ఇంకా పెళ్ళి కానేలేదుగా లల్లీ ?"

''మా వివాహం యెప్పుడో అయిపోయింది. ప్రపంచాని కది తెలియకపోవచ్చు; కాని చాలాకాలం క్రితమే మా హృదయాలు రెండూ ఏకమైనాయి."

పెద్దకోడలికి నవ్వొచ్చింది. పెదవులు బిగించి, కొంచె మాగి అన్నది - "ఈమాట యింకెక్కడైనా అనేవు!

సగం కాలం గడిచిపోయినదాన్ని. అయినా యిలాంటి మాట నోటితో అనడంమాట అటుంచి, వినటానికే సిగ్గేస్తోంది. నువ్వేమో థియేటరులో అభినయించుతూన్నట్టే అన్నిమాటలూ చెప్పేస్తున్నావు. ఇలా అయితే లోకం నిన్ను పిచ్చిదాన వంటుంది."

"నేను ప్రేమోన్మాదినినే!"

వివాహం.

నేడు వైశాఖశుద్ధ పంచమి. అనుపమ వివాహోత్సవ సందర్భంలో గ్రామమంతటా మహాకోలాహలంగా వున్నది. జగద్బంధుబాబు గృహంలో జనం పట్టకుండా వున్నారు. ఒకవైపున భోజన – సత్కారాల హడావుడి, మరొకవంక మేళ – తాళముల గడబిడ. ప్రొద్దెక్కుతున్నకొద్దీ కోలాహలం మిక్కుటమవుతోంది. రాత్రికే వివాహం జరుగుతుందిగాన, పెండ్లికొడుకు వస్తాంటాడు– అందరూ ఆనందోత్సాహాలతో హడావుడిగా వున్నారు. కాని పెళ్ళికొడుకు ఎక్కడున్నాడు? రాఖాల్ బాబుగారి యింటివద్ద సాయంత్రానికి పూర్వంనుంచి గంద్రగోళంగా వుంది. 'సురేశ్ ఎక్కడికి వెళ్ళాడు?' 'ఇటువెదకండి' 'అటు చూచిరం'డన్న కేకలు వినపడుతున్నై. ఎక్కడ వెతికినా సురేశుని జాడలేదు. దుర్వార్త వ్యాపించటానికెంతోసేపు పట్టదు. విద్యుత్ప్రవాహంలా యీవార్త జగద్బంధుబాబుయింటికి చేరింది. ఇంటిల్లిపాది జనం

నెత్తిమీద చేతులుపెట్టుకొని చతికిలబడ్డాడు. ఏమిటి యిలా జరిగింది!

సరిగా ఎనిమిది గంటలకు లగ్నం. కాని తొమ్మిది కొట్టినా పెళ్ళికొడుకు పత్తాలేడు. జగద్బంధుబాబు నెత్తి బాదుకుంటూ అటూ ఇటూ పరుగులు తీస్తున్నాడు. అనుపమతల్లి ఏడుస్తూ భర్తను సమీపించి "ఏమండీ, యిప్పు డేం జరగాలి?" అని అడిగింది. అప్పుడు జగద్బంధు బాబు సగం మతిపోయివున్నాడేమొ — "నా పిండా కూడు జరుగుతుంది, ఇం కేం జరుగుతుంది? ఈ దౌర్భా గ్యురాలి మూలంగా వృద్ధాప్యంలో నా కీర్తి, గౌరవాలు మట్టిపాలయినై. జాతీ పోయింది. ఇంక జాతిలోనుంచి బహిష్కరింపబడి బ్రతకాలి. అంతా మట్టిపాలు చేసుకోవ డానికే కాబోలు ముసలితనంలో నిన్ను పెళ్ళాడింది! నీ మూలంగానే ఇవాళ యింత అవమానంపా లవుతు న్నాను. శాస్త్రాల్లో రాసేవుందిగా 'స్త్రీబుద్ధిః ప్రలయం కరి' అని. నీ మాటలువినే నా కాళ్ళు నేను నరుక్కు న్నాను. పో పో. నీ పిల్లను తీసుకొని నాయెదుటనుంచి వెళ్ళిపో" అని బిగ్గరగా కేకలువేశాడు.

పాపం! అనుపమతల్లి దుఃఖం వర్ణింప నలవికాకుండా వుంది. ఇక్కడి స్థితి యిలావుంటే అక్క డింకో కష్టమొ చ్చింది. అనుపమకి మాటిమాటికి మూర్ఛ వస్తోంది.

రాత్రి గడచిపోతోంది. పది,పదకొండు,పన్నెండు—

ఇలా రెండుగంటలు కొట్టింది. కాని ఎక్కడా సురేశ్న జాడలేదు.

సురేశ్ కనపడనీ, కన్పించకపోనీ అనుపమ పెళ్ళిచేసి తీరాల్సిందే. అవునుమరి, ఈ రాత్రి అనుపమ వివాహం జరక్కపోతే జగద్బంధుబాబుకు జాతిబహిష్కారంతప్పదు.

రాత్రి మూడుగంటలుకూడ అయింది. గ్రామపంచాయతీపెద్దలు—జగద్బంధుబాబు శ్రేయోభిలాషులు—అంతాకలిసి యాభైయేండ్ల ఉబ్బసరోగి రామదులాల్ దత్తుకు వేషంవేసి తీసుకొచ్చి కూర్చోబెట్టారు.

అనుపమ తనజీవితాన్ని నాశనం చేసేందుకు చేయబడుతున్న ఈ ప్రయత్నాన్నిగూర్చి వినగానే తల్లిపాదాల మీదపడి "అమ్మా, నన్ను రక్షించు. నాగొంతు ఈ విధంగా కొయ్యొవద్దు. ఈపెళ్ళి జరిగితే నేను నిజంగానే ఆత్మహత్య చేసుకుంటాను" అని ఏడ్చింది.

"నే నేంచేయగలను తల్లీ !" అన్నది తల్లి ఏడుస్తూ.

పైకి ఏమన్నప్పటికీ కుమార్తెదుఃఖం చూచి ఆమె హృదయం దహించుకుపోతోంది. ఏడుస్తూనే మళ్ళీ భర్త వద్దకువెళ్ళి "తర్వాత ఏం జరుగుతుందో ఆలోచించి చూడండి. ఈ పెళ్ళి జరిగితే నాబిడ్డ విషంతిని చచ్చిపోతుంది"అని మొరపెట్టుకున్నది. జగద్బంధుబాబు మాట్లాడకుండా లేచి అనుపమవద్దకు పోయి 'లే. తెల్లవారవస్తోంది' అన్నాడు.

"ఎక్కడికి నాన్నా ?"

"ఇప్పుడే కన్యాదానం చేసెయ్యాలి."

"నాన్నా నన్ను చంపివెయ్యి, నేను విషం తిని చస్తాను."

"తినా లనివుంటే రేపు తిందువుగాని, ఇవాళ నీపెళ్ళి చేసివేసి నాజాతిని నిలుపుకుంటాను. తర్వాత నీకు తోచినట్లు చేసుకో- విషమే తింటావో, చెరువులోనే పడతావో, ఏంచేసినా నే నడ్డుపెట్టనులే."

ఎంత ఘోరం ! అనుపమగుండె నిజంగానే గుభేల్ మన్నది. "నాన్నా, నన్ను రక్షించవూ ?" అని ఎంతో ఏడ్చి మొత్తుకున్నది. కాని ప్రయోజనం లేకపోయింది. దృఢప్రతిజ్ఞాబద్ధుడైన జగద్బంధుబాబు ఆ రాత్రే రామ దులాల్ దత్తు కిచ్చి అనుపమపెళ్ళి చేశాడు.

చాలా రోజులుగాపత్నీ విహీనుడైన వృద్ధ రామదు లాల్ యింట్లో నాఅన్న వారెవరూలేరు. రెండు పాత పెంకుటిళ్ళు, కొద్దిగా జరీబుమాత్రమే ఆయనకున్న యావదాస్తిని. జీవితం గడకటంకూడ చాల కష్టంగా వుంది. పెళ్లిచేసుకుని మరునాడే అనుపమను తనయింటికి తీసుకెళ్లాడు. కూడా చాలా సామగ్రితో దాస - దాసీలు కూడ వచ్చారు. ఏ కష్టమూలేకుండా ఆరేడురోజులు హాయిగా గడిచాయి. మామగారు ఘరానామనిషి అయ్యె.ఇప్పు డాయన కే చింతా లేదు. ఈపెళ్ళితో ఆయన

అదృష్టరేఖ బయటపడింది. కాని అనుపమవిషయం వేరుగావుంది. మరిరెండు రోజులువుండి అనుపమ పుట్టింటికి తిరిగివచ్చినతర్వాత ఆమెమోము చూచి దాస-దాసీలుకూడా చాటుగా కన్నీళ్ళు తుడుచుకున్నారు.

ఇంటికి వెళ్ళి ప్రాణత్యాగం చెయ్యాలని అనుపమ భర్తగృహంలోనే నిశ్చయించుకున్నది. ఇప్పుడామె నిజంగానే చచ్చిపోవా లనుకుంటోంది. చాలా పొద్దుపోయి యింట్లోవారందరూ నిద్రించినతర్వాత మెల్లగా లేచి అనుపమ దొడ్డిద్వారంగుండా వెళ్ళి తోటలోకి వెళ్ళింది. చెరువు రేవులోకి పోయి మెట్లమీద కూర్చున్నది. ఇవాళ ఆమె మరణించవలసి వుంది—నోటిమాటకాదు, నిజంగానే. మరొకప్పుడుకూడ తా నిక్కడికి చచ్చిపోదామని వచ్చినసంగతి అనుపమ కిప్పుడు జ్ఞాపకమొచ్చింది. కాని తా నా నాడు ప్రాణత్యాగం చేయలేకపోయింది. ఎందుచేత? అప్పుడొకవ్యక్తి వచ్చి తన్ను పట్టుకున్నాడు. ఇవాళ అత డెక్కడున్నాడు? జైల్లో శిక్ష అనుభవించుతున్నాడు. అపరాధం? తన్ను ప్రేమించుతున్నానని చెప్పటంకోసమే అతను వచ్చాడు. మరి అతన్ని జైలుకు ఎవరు పంపారు? చంద్రబాబు. ఎందువల్ల? చంద్రబాబుకి అతడంటే పడదు—అతడు త్రాగుబోతు, తోటలో అనధికారప్రవేశం చేశాడు. కాని తాను తప్పించలేకపోయిందా? తప్పించగలదు కాని, తా నాపని చేయలేదు.

పైగా అతన్ని జైలుకి పంపించడానికే తోడ్పడింది. ఇప్పు డామె కాలోచనకలిగింది—లలితమోహన్ నిజంగా నన్ను ప్రేమిస్తున్నాడా? ప్రేమించుతూవుండవచ్చు. లేకపోనూ వచ్చు. కాని అతన్ని శిక్షింపజేసినందువల్ల నాకు ఒరిగిం దేమున్నది? ఏ కోరిక తీరింది? జైలులో అతడు రాళ్ళు కొడుతూండవచ్చు, లేక గానుక లాగుతూండవచ్చు, కాకయింకే కఠినపరిశ్రమఅయినా చేస్తూండవచ్చు. ఇందు వల్ల చంద్రబాబు కేమైనా లాభించితే లాభించినదేమో కాని, నాకేం ప్రయోజనం కల్గింది? అతను శిక్షింపబడక పోతే మాత్రం యిప్పుడు తమ అభ్యున్నతికోసం ఆనం దంగా ఓడలో విదేశానికి ప్రయాణం చేస్తున్నవారిని నేను పొందగలిగేదాన్నా?

అనుపమ చాలసేపటివరకు ఏడుస్తూ కూర్చున్నది. తర్వాత నీటిలోకి దిగింది. మోకాళ్ళలోతుకు, రొమ్ము వరకు, మెడలోతుకు-తుదకు పుక్కిలింతలయ్యేవరకు వెళ్ళింది. అరనిమిషం మునిగినది; కడుపులోనికి నీళ్ళు వెళ్ళాయి. పైకి తేలింది, మళ్ళీ మునిగింది. ఆమెకు ఈత వచ్చు. చెరువులో అన్నివేపులా వెళ్ళిచూచిందిగాని, ఎక్కడా అందనిలోతు కనబడలేదు. ఆమె ఎన్నిసార్లో మునిగింది; కడుపులోకి చాలా నీళ్ళు వెళ్లాయి; కాని లేవకుండా మునిగిపోయేంతనీరు లేకపోయింది. చచ్చి పోదామన్న సంకల్పంతోనే మునుగుతోంది. కాని, ఊపి

రాడక గాలిపీల్చడానికి పైకిరావాల్సివస్తోంది. ఎన్నిసార్లో చేస్తూ చెరువంతటా, ఈదుతూ తెల్లవారేముందు అలసి పోయిన దేహాన్ని రేవుమెట్లమీదికి చేర్చింది. ఏస్థితిలో ఏకారణంవల్లనైనాగానీ ఈ విధంగా కొంచెం కొంచెంగా చావటం సులభం కాదనిపించింది. అదివరకు ఆమె విరహ వేదనచే విరక్తి:చెంది ఎన్నిపర్యాయములో చావాలనుకు న్నది. అప్పుడు జీవించడం, మరణించడం నాయికానాయ కుల ఇచ్ఛాధీనమే ననుకొనేది. కాని ఇవాళ తెల్లవార్లూ, ప్రాణంతో యుద్ధంచేసినా దూరంచేయలేక పోయింది. తన పదకొండేళ్ళప్పటి విరహవ్యథలోకూడ శాశ్వతంగా ప్రాణాన్ని విసర్జించటం సంభవం కాదని యిప్పుడు బోధపడింది.

తెల్లవారకముందే యింటికి చేరేప్పటికి చలిచే ఆమె దేహం వణకిపోతోంది. "ఇంతవేకువనే స్నానంచేసి వచ్చావా అమ్మాయ్?" అని తల్లి అడగ్గా అనుపమ "అవు"నని తలూపింది.

ఇక దత్తుమహాశయుడు ఒకవిధంగా అత్తవారియింట్లో శాశ్వతంగానే పీఠంవేశాడు. మొదట్లో కొంతవరకు అతడికి అల్లుడి మర్యాదలు బాగానే జరిగాయి. కాని క్రమంగా అవి దిచనారంపోసాగినై. ఇంట్లో ఇప్పు డెవరూ ఆయున్ని గౌరవించటంలేదు. చంద్రబాబు ప్రతివిషయం లోను పరిహసించుతూ, ఎత్తిపొడుస్తూ అన్నివిధాల

అవమానించుతున్నాడు. అందుకు కారణంకూడ లేకపో లేదు. చంద్రబాబుది అసలే ఈర్ష్యాస్వభావం. పైగా జగద్బంధుబాబు అల్లుడు చేతకానివాడని కొంతఆస్తి ముట్టజెపుతానన్నాడు. అనుపమ ఎప్పుడూ దగ్గరకేరాదు. అత్తగారుకూడ ఆజతీసుకోవడంలేదు. అయినా రామ్‌దులాల్‌కి రోజులు హాయిగానే గడచిపోతున్నాయి. స్వాగత సత్కారాలు, బంధుమర్యాదలు ఆయనకు లక్ష్యమేలేదు. దొరికినదానితోనే తృప్తిపడుతున్నాడు. వృద్ధాప్యంలో రెండుపూటలా మంచి భోజనం దొరుకుతోంటే అదే చాలనుకున్నాడు. కాని, ఈ సుఖమనుభవించేరోజు లింకెన్నో లేవు ఆయనకి. అసలే కృంగి—కృశించిన దేహం. అందులోను తన చిరసహవాసి కాసరోగం ఈసారి వదలకుండా పట్టుకున్నది. అది ప్రతి సంవత్సరం శీతకాలం ఆయన్ను స్వర్గారోహణం చేయించేందుకు గుంజుతూనేవుంది. ఈ యేడు చలికాలంలో ఆ పెనుగులాట మరీ యెక్కువైంది. రామ్‌దులాల్ నరనరంలోను క్షయరోగం జీర్ణించివున్నదని జగద్బంధుబాబు గ్రహించాడు. పల్లెటూళ్ళో సరియైన చికిత్సకుఅవకాశంలేక ఆయన్ను కలకత్తా పంపించాడు. అక్కడ కొన్నాళ్ళపాటు చికిత్స బాగానే జరిగింది. తర్వాత సాధ్వీమణి అనుపమాదేవి అదృష్టంకొద్దీ రెండో సంవత్సరం పూర్తికాకముందే సదానందుడు రామ్‌దులాల్

ఇహలోకాన్ని విడిచిపెట్టిపోయాడు.

## వైధవ్యం.

అయినా అనుపమ ఏడ్వకపోలేదు. భర్త మరణించితే హిందూ స్త్రీ ఏడ్వాలి, కాబట్టి ఏడ్చింది. తర్వాత తన యిష్టంతోనే నగలన్నీ తీసివేసి తెల్లపంచె కట్టుకున్నది. తల్లి ఏడుస్తూ "అనూ, నీయీరూపం చూడలేనే. పోనీ చేతికి మురుగులైనా వుంచుకోవే" అంది.

"అలా వీల్లేదు. విధవకు నగ లేమిటి?"

"కాని నువ్వింకా చిన్నపిల్లవేనే!"

"అయితే యేం? హిందూ స్త్రీ విధవ అయితే పిల్లా, ముసలిదా అన్న తేడా యేముంటుంది?"

తల్లి ఇంకేమంటుంది? వలవల ఏడ్చింది.అంతే. అనుపమ విధవ అవడంతో జనానికి క్రొత్తగా దుఃఖమేమీ కలుగలేదు. ఒకటి రెండేండ్లలో ఆమె విధవ అవుతుందని అందరికి తెలిసినదేగా. 'శవాని కిచ్చి పెళ్ళిచేస్తే సధవగా వుంటుందా యేమిటి?' అన్నారు ఎవరో. అనుపమ తండ్రికి ఈ సంగతి తెలుసు; తల్లికీ తెలుసు. కాబట్టే ఎవరికీ అంతగాదుఃఖం కలుగలేదు. అయినదేదో పెళ్ళినాటి రాత్రే అయిపోయింది. అనుపమ పతిని ప్రేమించనూ లేదు. అతనివంక చూడనూ లేదు. కాని కఠిన వైధవ్యవ్రతాన్ని మాత్రం ఆచరించసాగింది. రాత్రి పచ్చిమంచినీళ్ళయినా ముట్టదు. పగలు గుప్పెడుబియ్యం

తానే స్వయంగా పొంగించుకుంటుంది. ఏకాదశినాడు నిర్జల ఉపవాసం చేస్తుంది. ఇవాళ పౌర్ణమి. రేపు అమావాస్య. ఎల్లుండి శివరాత్రి — ఈవిధంగా నెలలో పదిహేనురోజులు ఆమె నిరాహారంగానే వుంటోంది. ఎవరేనా ఏమైనా చెప్పితే "నా యిహలోకసుఖం నాశనం అవనే అయింది. మరి పరలోకానికైనా ఏమేనా చేసుకోనీండి'' అంటుంది. కాని ఇదంతా ఆమె ఎలా సహించగల్గుతుంది ? ఉపవాసాలతోను, వ్రతాలతోను ఆమె యెండి సగమైపోయింది. తల్లి ఈ స్థితి అంతా చూచి ఇంక కూతురు జీవించదనీ, చచ్చిపోతుందనీ అనుకున్నది. చచ్చిపోవడం విచిత్రమేమీకాదని తండ్రీ అనుకున్నాడు. అందువల్లే ఒకరోజున ఆయన భార్యను పిల్చి ''అనూకి మళ్ళీ పెళ్ళిచెయ్యి" అని చెప్పాడు. భార్య ఆశ్చర్యాన్వితయై ''అదెలాగు! ధర్మంపోదూ?" అన్నది.

"నేను బాగా ఆలోచించాను. రెండుసార్లు పెళ్ళిచేస్తే ధర్మమేమీ పోదు. పెళ్ళికీ ధర్మానికీ సంబంధంలేదు. అంతేగాక ఈవిధంగా మనబిడ్డని చంపుకుంటేనే పాపం."

''అయితే చెయ్యండి."

కాని ప్రస్తావన విని అనుపమ మెడ ఆడించి "అలా వీల్లే"దని గట్టిగా చెప్పేసింది.

తండ్రి స్వయంగాకూడా కుమార్తెను పిల్చి "అలా చెయ్యొచ్చు అమ్మాయ్" అని చెప్పాడు.

"అందువల్ల నా యిహలోకంతో పరలోకంకూడ నాశనమౌతుంది.''

"ఇప్పుడు చెడిపోయిందీలేదు, ఇంక చెడేదీలేదు. గుణ వంతుడైన భర్త లభించితే నువ్వు రెండు లోకాల్లోనూ తరించగలవు."

''ఏం, ఒంటరిగా తరించలేనూ?''

''కాదమ్మాయ్, ఒక్కతెవే తరించలేవు. ముఖ్యంగా హిందూస్త్రీ అంతే. ధర్మంసంగతి అలావుంచి ఎంత చిన్నపనికైనా స్త్రీ పురుషునిపై ఆధారపడాలి. మరిఅటు వంటి ఆధారం భర్తకాకపోతే యింకెవరు చెప్పు! పైగా ఏ అపరాధానికి నీ కింత శిక్ష!''

అనుపమ నేలచూపు చూస్తూ ''నా పూర్వజన్మ ఫలితం!" అంది.

పక్కా హిందువైన జగద్బంధుబాబు చెవులకూడ ఈమాట శూలంలా తగిలింది. కొంచెంసేపాగి ఆయన అన్నాడు—''అలాగే అయితే, నీకు ఒక సంరక్షకుడు వుండాలి. నాతర్వాత నిన్నెవరు చూస్తారు?''

"అన్నయ్య వున్నాడుగా."

''అలా జరుగకుండుగాక! కాని వాడు చూడకపో తేనో! వాడు నీ తల్లికడుపున పుట్టినవాడు. కాదు. పైగా నే నెరిగినంతవరకు వాడిబుద్ధి మంచిది కాదు."

అప్పుడు అనుపమ 'అయితే విషంత్రాగిమింగుతాను' అను

కున్నది మనసులో. తండ్రి ఇంకా చెబుతున్నాడు -
"ఇంకో సంగతికూడ వున్నది అనూ. తండ్రినై యుండి కూడ ఆమాట చెప్పకతప్పదు. మనిషి మనసు ఎల్లకాలం ఒకేరీతిగా వుంటుందనటానికి వీల్లేదు. ముఖ్యంగా యావనంలో కోరికలను అదుపులో పెట్టుకోవడం ఋషులకు, మునులకే కష్టం."

కొంచెమాంగి అనుపమ "జాతి పోతుందిగదూ?" అన్నది.

"లేదు అమ్మాయ్; జాతిపోదు. నాకు రోజులు దగ్గర పడుతున్నై. ఇప్పుడు కళ్ళు తెరిచాను."

అనుపమ తలాడించింది. తన మతిలో అనుకున్నది—
'అప్పుడు జాతిపోయేది! ఇప్పుడు పోదూ? కళ్ళూ, చెవులూ మూసుకొని మీరు నన్ను బలియిచ్చేప్పుడు యీ సంగతులన్నీ యెందు కాలోచించలేదు? ఇప్పుడు నేనూ బాగానే బదులు తీర్చుకుంటాను.'

అనుపమ ఏవిధంగానూ అంగీకరించకపోగా "సరేలే అమ్మా! నీ కేది మంచిదనితోస్తే అలాగే చెయ్యి. నీ అభీష్టానికి విరుద్ధంగా నేను నీకు పెళ్ళిచెయ్యనులే. నీతిండి, బట్టలకు యెన్నడూ ఏవిధమైన కష్టముకలుగకుండా నేను తప్పకుండా యేర్పాటు చేసిపోతాను. నీతి ధర్మాల్లో మనసుంచి నీ కెలా సుఖంకలుగుతుందో అలాగే చెయ్యి" అన్నాడు తండ్రి.

## చంద్రబాబు కుటుంబం.

జైలునుంచి విడుదల అయి లలితమోహనుడు ఇంటికి రాలేదు. "సిగ్గుచే రాలేదు" అని వకరంటే, "ఈ వూళ్ళోకి వచ్చి మొహమెలా చూపించుతాడు!" అన్నా రింకొకరు.

లలిత మోహనుడు రెండేళ్ళపాటు ఎన్నోచోట్ల తిరిగి తిరిగి అకస్మాత్తుగా ఒకనాడు ఇంటికి వచ్చాడు. తల్లిఆనం దాతిరేకంలో అతని నొసలు ముద్దిడుకొని ఆశీర్వదించింది. "ఇంక పెళ్ళిచేసుకొని గృహస్థువు కారా నాయనా! రాసిపెట్టివున్న దేదో జరిగిపోయింది. ఇప్పుడు దాన్నిగురించి ఏమీ ఆలోచించవద్దు" అని చెప్పింది. అతడుకూడ యేదో వకటి చెయ్యాలనే నిశ్చయించుకున్నాడు.

అయిదేండ్ల అనంతరంవచ్చిన లలితమోహన్‌కి వూళ్ళో చాలా మార్పులు కన్పించాయి. ముఖ్యంగా జగద్బంధు బాబు యింట్లో మరిని. అనుపమ తల్లి—దండ్రుల్లో ఒకరూ జీవించిలేరు. చంద్రబాబే యిప్పుడు గృహయజమాని, అనుపమ తండ్రిగారిచ్చిపోయినధనంతో ఏతీరస్థానంలోనో వుండిపోదామనుకున్నది. ఆ ధనంతోనే ధర్మ - పుణ్య కార్యాలు, వ్రతాలుచేస్తూ శేషజీవితం సులువుగా వెళ్ళ బుచ్చాలనుకున్నదికూడాను. కాని తండ్రి పెద్దకర్మవగైరా అయిపోయినతర్వాత వీలునామా చూచి అనుపమ హృదయానికి పెద్దగాయం తగిలింది. తనతండ్రి తనకు అయిదువందలరూపాలుమాత్రమే యిచ్చిపోయినట్లుంది

అందులో! ఆయన పెద్దమనిషి. ఇలాంటి చిన్న మొత్తాలు ఆయనకి లెక్కే లేదు. మరి యీ డబ్బుతో ఎవరికైనా జీవితం గడుస్తుందా? గ్రామస్థుల్లో గుసగుసలు సాగినై. ఈ వీలునామా జగద్బంధుబాబుది కానేకా దనుకున్నారు. ఇదేదో ఫోర్జరీపత్ర మనుకున్నారు. కాని ఏం లాభం? గత్యంతరంలేక అనుపమ చంద్రబాబు ఇంట్లోనే వుండిపోయింది.

తండ్రి బ్రతికివుండగా సవతితల్లి గుణం తెలియదని లోకోక్తి. అట్లే మారుటన్న మనసుకూడ తండ్రి జీవించి వుండగా గ్రహించటం కష్టమే. ఇన్నాళ్ళకు చంద్రబాబు యెలాంటివాడో అనుపమ గ్రహించింది. ఎన్నిరకాల అధము లుంటారో వారందరికంటె నికృష్టుడుగా కన్పించాడు చంద్రబాబు. హృదయంలో కించిత్తయినా జాలి, దయ లేవు; కళ్ళలో రవంత సిగ్గులేదు. నిరాశ్రయ స్థితిలో వున్న అనుపమపట్ల అతడు ప్రవర్తించుతూన్న రీతిని నోటితో చెప్పశక్యంకాదు. ప్రతి చిన్నవిషయంలోను — కూర్చుంటే, లేస్తేకూడ తిరస్కారంతో, కళంక మాపాదింపబడి అవమానింపబడుతోంది. కొన్నాళ్ళుగా ఆమెను రెండుకళ్ళా చూడలేకున్నారు. ఇప్పు డసలే ఆమె అంటే పడకుండావుంది. పెద్దకోడలు పూర్వం అనుపమను ప్రేమగానే చూచేదికాని, ఇప్పుడు మహాఅసహ్యించుకుంటోంది. అనుపమ పెద్దమనిషికూతురుగా వున్నప్పుడు— ఆమె తల్లి—

దంత్రులు వుండగా ఆమె సైగచేసినంతనే నల్గురైదుగురు మనుష్యులు పరుగెత్తుకొని వచ్చేరోజుల్లో ఆమెకూడ అను పమను ప్రేమించుతూండేది. కాని ఇప్పుడో, ఇప్పు డామె విధవ. దుఃఖితురాలు. నా అన్నవా రెవరూ లే రామెకి. డబ్బు అంతకంటే లేదు. ఇతరులరొట్టె తినకుండా ఆమెకు జరుగదు. మరి ఇప్పుడామె నెవరుప్రేమిస్తారు? ఎవ రామె యందు శ్రద్ధ వహిస్తారు ? పెద్దకోడలికి ముగ్గురు నలు గురు పిల్లలు. వా రందరిభారం ఇప్పుడు అనుపమదే. వారిని స్నానంచేయించడం, దుస్తులు తొడగటం, అన్నం తినిపించడం, పక్కలో పడుకోబెట్టుకొని నిద్ర పుచ్చడం వగైరా పనులన్నీ అనుపమే చేస్తున్నది. అయినా ఏచిన్న లోపంజరిగినా వెంటనే పెద్దకోడలు మండిపడి నాలుగూ అనేది. ఇంతేకాక అనుపమ నిత్యము చంద్రబాబుకోసం రెండుమూడు మంచికూరలు వండవలసివచ్చేది. వంట మనిషి బాగా చెయ్యకపోతే చంద్రబాబు ఆనాడు వుప వాసమే. అంచేత ఏకాదశి అయినా, ద్వాదశి అయినా—ఉపవాసమున్నా ఈమాత్రం ఆమె చేయక తప్పదు. విధవ అయినప్పట్నుంచీ అనుపమ తెల్లవారుజామున లేచి నిత్య కృత్యాలు నిర్వహించుకొని, స్నానంచేసి చాలాసేపటి వరకు పూజచేస్తుండడం నియమం చేసుకున్నది. కాని ఆమె కిప్పు డంతఅవకాశంకూడ ఇవ్వడంలేదు. కొంచెం ఆలస్యమైతేనే పెద్దకోడలు “తొందరగా ముగించుకు

రావమ్మా, పిల్లలు ఏడుస్తున్నారు. ఇంకా వాళ్లకి తిన టాని కేమీ పెట్టనే లేదు'' అనేది. అనుపమ ఎలాగో పూర్తిచేసుకొని లేచేదేకాని, పల్లెత్తుమాట అనగల్గేది కాదు. ఏకాదశి వుపవాసంచేసికూడ ఆమె రాత్రిపూట వంట చేయవలసివచ్చేది. పొయ్యిసెగను దాహంతో నాలుక పిడచకట్టేది; ఆ వేడికి కుమిలిపోయేది. దేహం స్వాధీనం తప్పుతూండేది. అయినా నోటితో ఒక్క మాట అనేదికాదు. పరిస్థితిమారుటతో ఓర్పుకూడ అధిక మవుతుంది. అది ఈశ్వరుడే నేర్పుతాడు. లేకపోతే అనుపమ ఏనాడో చనిపోయివుండేది.

ఈ కుటుంబంలో ఆమెకంటె దాస-దాసీలే మెరుగు. వారి నెవరైనా ఏమేనా అంటే వాళ్ళు జవాబైనా ఇవ్వ గల్గుతారు. 'మా జీతం ఇవతల పారెయ్యండి. మాదారిని మేం పోతా'మనైనా అనగలరు. కాని అనుపమ అంత మాత్రంకూడా అనలేదుగదా ఈమె జీతంలేనిదాసి. ఆమెనుకొట్టినా, నరికినా, ఏంచేసినా ఇక్కడ పడివుండా ల్సిందే. కాక మరెక్కడికి వెళ్తుంది? ఒకటి విధవ, రెండు గొప్పింటి పశువు. అనుపమస్థితి ఎవరికివారు తెలుసుకో వాల్సిందేగాని, ఒకరు చెప్పేదికాదు. పరులపై ఆధార పడే హిందూవిధవ అయితే బాగాఅర్థంచేసుకోగలదు. మిగతావారికి అర్థమవడం కష్టమే.

ఇవాళ ద్వాదశి, వేకువనే లేచి స్నానాదులు ముగిం

చుకొని అనుపమ పూజకు కూర్చున్నది. పదిహేను నిమిషాలైనా కాకముందే పెద్దకోడలు బయటినుంచే బిగ్గరగా కేకపెట్టింది—ఏఁవమ్మోయ్, ఇవాళ పగలు నీపూజే పూర్తి కాదల్లేవుందే! ఇలాఅయితే కుదరదమ్మా. నేను ముందే చెప్తున్నాను." అనుపమ మహేశ్వరునికి పుష్పాలు అర్పించుతూన్నందున మాట్లాడలేదు. పెద్దకోడలు మళ్ళీ పదినిమిషాల్లోనే వచ్చిపడింది. "ఇంత పుణ్యం దక్కదమ్మాయ్. పుణ్యం మరీ ఎక్కువగా చెయ్యకు. అదేపనిగా పుణ్యమే సంపాదించుకోవాలనుకుంటే ఏ అడివిలోకో పోయి, చేసుకో. ఇక్కడ ఇంటి గొడవలో యింత అతిశయం పనికిరాదు" అని అరిచింది. అయినాకూడ అనుపమ నోరెత్తనేలేదు.

అంతట వదినగారు మరింతబిగ్గరగా అరుస్తూ అన్నది— "ఎవరూ ఏమీ తిననక్కరలేదా యేఁ?" అనుపమ చేతిలోని బిల్వ పత్రం క్రిందపెడ్తూ "నాకు ఒంట్లో బాగాలేదు, నే నివాళ యేమీ చెయ్యలేను" అని చెప్పింది.

"చెయ్యలేవూ? అయితే అందరూ వుపవాసం చెయ్యాలా యేఁ?"

"ఏఁ. నేనుతప్ప ఇంకెవరూ లేరా? వంటమనిషి ఏమయ్యాడు?"

"అతనికి జ్వరంవచ్చింది. అదీగాక వంటమనిషి

వండింది ఆయనకు రుచిస్తుందా!"

"రుచించకపోతే నువ్వు వండు."

"నేను వంటచెయ్యనా! తలనొప్పితో మాడు పగిలి పోతోంది; వైద్యుడెప్పుడూ నా వెనుక తిరుగుతూనే వుండె. మరి నేను పొయ్యిసెగలో కాలిపోనా?"

అనుపమ కోపంపట్టలేకపోయింది. "అయితే అందర్నీ వుపవాసం చెయ్యమని చెప్పు" అన్నది.

"మంచిదేలే; పోయి మీ అన్నయ్యతోనే చెపే స్తాను. నీకు జబ్బెక్కణ్నుంచి వచ్చింది? ఇంతకుముందేగా స్నానంచేశావు! ఇంక భ్రమింగుతావుకూడాను. అన్నగారికి కాస్త వండిపెట్టలే వన్నమాట!"

"నావల్ల కాదు. వదినగారూ, నేను మీరుకొనుక్కున్న దాసీని కాదు. నోటికివచ్చినట్టు అనేస్తున్నారు. నే నీమాట లన్నీ అన్నయ్యతో చెప్పేస్తాను."

పెద్దకోడలు మూతివంకరగాపెట్టి "పోయి చెప్పుకో, మీ అన్నయ్య నాతల త్రుంచేస్తారు కాబోలు!"

అనుపమ కాస్సేపు స్తబ్ధురాలయింది "అవును, అది నాకు తెలుసు. అన్నయ్యే మంచివాడైతే నువ్వింత శృతి మించవు" అన్నది.

"ఏం, ఆయ నేంచేశారు? తిండికీ బట్టకీ యిస్తున్నారు; ఇం కేం చెయ్యాలి? నన్ను వెళ్ళగొట్టి నిన్ను నెత్తిమీద యెక్కించుకోనిమాట నిజమే!—ఇంతకోపం తెచ్చుకొని

ఏం ప్రయోజనం?"

దేనికైనా ఒక హద్దుంటుంది. అనుపమ ఓర్పుకికూడ హద్దున్నది. ఇన్నాళ్ళనుంచీ ఆమెనోట రానిమాట ఇవాళ రానేవచ్చింది—"అన్నయ్యా నాకు తిండికీ బట్టకీ యిచ్చే దేమిటి? ఆయనా నాన్నగారి ఆస్తిలోనిదే తింటున్నాడు. నేనూ అందులోనిదే తింటున్నాను." అన్నది.

పెద్దకోడలు ఆగ్రహావేశంతో "అలాగే అయితే మీ బాబు నిన్ను బజార్లో బిచ్చగత్తె నెందుకుచేసిపోతాడు!"

"నన్ను బిచ్చగత్తెనుగా మా నాన్నేమీ చెయ్యలా; మీరే చేశారు. వారు నన్ను నిరాశ్రయురాలిని, కూటికి గతిలేనిదాన్ని చేసిపోలేదని ఊళ్ళో అందరికీ తెలుసు. నా కిచ్చినదాన్ని అన్నయ్యా కాజెయ్యకపోతే నేను నీ యీబెదరింపులు వినాల్సిన అగత్యమే వుండేది కాను."

ఇదీ విన్నప్పుడు మొదట పెద్దకోడలి మొహం దించుకుపోయింది గాని, మరుక్షణంలోనే ఆమె మరింత భగ్గుమని "ఊళ్ళో అందరికీ తెలుసా, ఆయన దొంగ అని? ఆ సంగతే వారితో చెప్పనా?" అన్నది.

"చెప్పు. ఈ పాపఫలితం ఆయన అనుభవించితీరాలని కూడా చెప్పు."

ఆనాడు ఇలాగేజరిగిపోయింది. ఇదంతా చంద్రబాబుక్కూడా తెలిసింది. కాని అత డేమీ మారుపల్కలేదు.

చంద్రబాబుఇంట్లో భోలా అనే ఒక నుర్రవాడు నౌక

రుగా వుంటున్నాడు. అయిదారురోజులు గడచినతర్వాత చంద్రబాబు వాడిని యింట్లోకి పిల్చి వూరకే బాదసాగాడు. వానియేడ్పు విని మిగతా దాస - దాసీలంతా వచ్చి గుమిగూడారు. అంతవరకు అదేవరుసగా దెబ్బలు పడుతూనేవున్నై. అనుపమ తనగదిలోకూర్చునిపూజచేసుకుంటున్నదల్లా యీ గల్లంతు విని లేచి పరుగెత్తుకొచ్చింది. అప్పుడు భోలానోటినుండి, ముక్కునుంచి రక్తం ప్రవహించుతోంది. "అన్నయ్యా, ఇదేమిటి? ఇలా కొట్టితే చచ్చిపోడూ?" అని అనుపమ అరిచింది.

"ఇవాళ ఈ దౌర్భాగ్యుణ్ని చంపేస్తాను. వీడితో పాటు నిన్నూ చంపేవాడినే కాని, ఆడుదానవని వదిలేస్తున్నాను. నా యింట్లో యింత పాపకృత్యాన్ని సహించలేను. నాన్నగారు నీకు అయిదువందలుయిచ్చిపోయారు. అవి తీసుకొని నువ్వు ఇవాళే నాయింట్లోనుంచి వెళ్ళిపో" అని చంద్రబాబు బిగ్గరగా అరుస్తూ అన్నాడు.

అనుపమ కేమీ అర్థంకాలేదు. "ఎందువల్ల?" అని మాత్రం అడిగింది.

"ఏంలేదు. ఇవాళే అయిదువందల రూపాయలూ తీసుకొని, భోలాతో లేచిపో. బయటికిపోయి నీఇష్టం వచ్చినట్లు చేసుకో."

అనుపమ మూర్ఛితురాలైపడిపోయింది. దాస-దాసీలు యావన్మందీ యీ సంగతి విన్నారు. నోటికి చెయ్యి

అడ్డుపెట్టుకొని కొందరు నవ్వారు. బలవంతంగా నవ్వాపుకొని ఏమీ ఎరుగనట్లు కొందరు జారుకున్నారు. ఒకరిద్దరు అనుపమను లేవదీయబోయారు. చంద్రబాబు మృతప్రాయుడై పడియున్న భోలా మొహంమీద ఒక తన్నుతన్ని బయటికి వెళ్ళిపోయాడు.

## తుది రోజులు.

ఇవాళే ఆఖరురోజు. అనుపమ ఇంక యీ యింట్లో వుండదు. తెలివివచ్చినప్పట్నుంచీకూడ ఆమెకే సుఖమూ లేకపోయింది. చిన్నతనంలోనే ప్రేమించటంనేర్చుకొని తనసుఖాన్ని తానే నాశనంచేసుకొన్నది. 'అతి'కావటం వల్ల భగవంతుడామెకే మాత్రం సుఖం కలుగజేయలేదు. తాను కల్పించుకొని ఎవరినైతే ప్రేమించినదో అతడామెకు లభించలేదు. తన్ను ప్రేమించవచ్చినవానిని తిరస్కరించి దూరంగా తరిమికొట్టింది. ఆమెకు తల్లిలేదు. తండ్రిలేడు. మొక్కఁజా నుంచోట్లానికి నీడలేదు. పతివ్రతా స్త్రీలకు వున్న ఆధారమల్లా పాతివ్రత్యకీర్తే. దాన్ని ఈశ్వరుడామెనుంచి లాగివేయ జూస్తున్నాడు. అందువల్లనే ఇప్పుడింక ఆమె ఆఇంట్లో వుండకూడదనుకున్నది. తీవ్రక్షోభచే ఆమెగుండె బ్రద్దలవుతూన్నట్లుంది. నిస్తబ్ధంగావున్న ఆ వెన్నెలరాత్రి దొడ్డిద్వారం తెరుచుకొని అదే చెరువుమెట్లమీదికి పోయి కూర్చున్నది. అనుపమ ఇప్పుడు యుక్తిపరురాలైంది. వెనుక ఆమెను ఈత మర

ణించనీలేదు. ఇప్పు డామె ఒక బిందెకూడ తెచ్చింది. ఈసారి అందనిలోతు యెక్కడున్నదో వెదకి తప్పకుండా మునిగి చచ్చిపోవా లనుకున్నది. మరణించేముందు ప్రపంచం అతిసౌందర్యంగా కనపడుతుంది. ఇల్లు - వాకిలి, ఆకాశం, మేఘాలు, చంద్రుడు, నక్షత్రాలు, నీరు, పుష్పాలు, లతలు, ఆకులు, చెట్లు — అన్నీ అత్యంత రమణీయంగా కన్పించుతాయి. ఎక్కడ దేన్ని చూచినా మనోహరంగా వుంటుంది. ప్రతిదీ వ్రేలెత్తి చూపుతూ 'చచ్చిపోవద్దు; చూడు, మే మెంత సుఖంగా వున్నామో! నువ్వూ ఓర్పువహించితే నీవూ ఒకనాడు సుఖపడతావు. కాకపోతే మాదగ్గరకు రా. మేము నిన్ను సుఖపడేటట్లు చేస్తాము. దేముడిచ్చిన ఆత్మని వృథాగా నరకంలో పడద్రోయవద్దు సుమా!' అని చెపుతున్నట్లే వుంటుంది. అందువల్లనే చావును సిద్ధపడికూడా మనిషి మళ్ళీ వెనకాడుతాడు. కాని, వెనుదిరిగి తన కీ లోకంలో కించిత్తయినా సుఖంలేదని, ఈ విశాలవిశ్వంలో నిలబడేందుకు స్థానంలేదని, 'నా' అని చెప్పుకోవటాని కెవరూ లేరని చూచుకున్నప్పుడు మళ్ళీ మరణించా లనిపిస్తుంది. మరుక్షణంలోనే 'రామరామ! వెనక్కి తిరిగిపో. ఇలాంటిపని చెయ్యకు. చచ్చిపోయినంతమాత్రాన దుఃఖాలన్నీ దూరమైపోతాయా? ఇంతకంటెకూడ భయంకరదుఃఖాగ్నికీలల్లోకిపోయి పడవని నీ కేం తెలుసు?" అని లోపల్నుంచి

ఎవరో అన్నట్టుంటుంది. ఇంకేముంది? మనిషి సంకుచితుడై వెనక్కి తగ్గి నిలబడుతాడు. అనుపమ కీ విషయాలన్ని తల పుకురాకుండా వుంటాయా? అయినా ఆమె మరణించి తీరుతుంది. ఇంకే విధంగానూ ఆగదు

తండ్రిమాటలు జ్ఞప్తికి వచ్చాయి. తల్లి తలపు కొచ్చింది. మరో వ్యక్తి కూడా స్మృతిపథంలో నిలిచాడు. అత డెవరో కాదు, లలితమోహనుడే. ఆమెను ప్రేమించే వారొకరొకరే గతించిపోయారు. ఇంక ఒకే ఒక వ్యక్తి. జీవించివున్నాడు. అతడామెను ప్రేమించాడు; ప్రేమకోసం వచ్చాడు- తన హృదయదేవతగా ఎంచి పూజించటానికి వచ్చాడు. కాని అనుపమ అతని ఆ ప్రేమను స్వీకరించ లేదు. పైగా అతన్ని అవమానించి తరిమివేసింది. ఇంతేనా? అతన్ని జైలుకుకూడ పంపించింది. లలితబాబు అక్కడ ఎన్ని కష్టాలు అనుభవించాడో! బహుశః అత డక్కడ అనుపమను తిట్టివుండవచ్చు, శపించివుండవచ్చు. 'ఆ పాపఫలితంగానే నా కీఘోరకష్టాలు వచ్చాయి. ఎంత వేదన! అతడు తిరిగివచ్చాడు. ఇప్పు డతడు బాగుపడ్డాడు. త్రాగుడు మానివేసి, దేశసేవలో నిమగ్నుడై కీర్తిసంపా దించుతున్నాడు. ఇప్పుడుకూడ నన్ను జ్ఞాపకం చేసు కుంటూ వుంటాడా? అయితే అవనూవచ్చు, కాకపోనూ వచ్చు. అయినా దానితో ఏముంది? నాకు కళంక మా పాదింపబడినట్టు వినకుండావుంటాడా? కళంకినినై చెరు

వులోపడి చచ్చిపోయానని రేపు వూరంతా, చెప్పు కుంటూంటే—'అయ్యో రామ! ఎంత అసహ్యించుకొని, మొహం త్రిప్పేసుకుంటాడు!' అని ఈవిధంగా ఆలోచించుతోంది.

అనుపమ పైటచెంగుతో బిందెను మెడకు కట్టుకున్నది. అంతలో ఎవరో వెనుకనుంచి "అనుపమా!" అని పిలిచారు.

అనుపమ ఉలిక్కిపడింది. వెనుదిరిగిచూస్తే ఒక పొడుగాటి పురుషుడు నిలబడివున్నాడు. ఆగంతుడు మళ్ళీ పిలిచాడు— "అనుపమా!"

ఈ కంఠస్వరం తా నిదివర కెప్పుడో విన్నదే నని పించింది అనుపమకి. కాని జ్ఞప్తికి రావటంలేదు. ఆమె మెదలకుండా వున్నది.

"అనుపమా! ఆత్మహత్య చేసుకోకు."

అనుపమ ఏనాడూ లజ్జావతి కాదు. ఆమె ధైర్యంచేసి "నేను ఆత్మహత్య చేసుకుంటానని మీ కెలా తెలుసు?" అని అడిగింది.

"మరి మెడకు ఆ బిందె కట్టుకోవడ మెందుకు?"

అనుపమ మౌనందాల్చింది. ఆగంతుకుడు చిరునవ్వుతో "ఆత్మహత్యాఫలిత మేమిటో తెలుసా?" అన్నాడు.

"ఏమిటి?"

"అంతంలేని నరకం!"

అనుపమ కంపించిపోయింది. ఆమె మెల్లగా బిందెను వూడదీసి క్రిందపెట్టి "ఈలోకంలో నా కెక్కడా స్థానం లేదు" అన్నది.

"మరచిపోయావా? నేను జ్ఞాపకంచేస్తున్నాను, విను. సుమారు ఆరేండ్లక్రితం సరిగా ఇక్కడే ఒక అభాగ్యుడు నీకు జీవితాంతం స్థానమివ్వాలనుకున్నాడు—ఏం, జ్ఞాపకం వుందా?"

సిగ్గుచే అనుపమ మొహం ఎరుపెక్కింది "ఆ, జ్ఞాపకం వుంది" అన్నది.

"అయితే నీ యీ సంకల్పాన్ని విడిచిపెట్టు."

"నాకు కళంక మాపాదించబడుతోంది. నే నింక బ్రతకా లనుకోవడంలేదు."

"మరణించితే కళంకం మాసిపోతుందా?"

"మాసిపోయినా, మాసిపోవకపోయినా నే నింక విననుగదా!"

"నువ్వు పొరపాటుపడ్డావు అనుపమా! మరణించితే ఆ కళంకం శాశ్వతంగా నీ పేరుతో ఛాయారీతిని సంచరించుతూనే వుంటుంది. జీవించి చూడు, ఈ కల్పిత కళంకం చిరస్థాయిగా వుండదు."

"కాని, యెక్కడికిపోయి బ్రతకను?"

"నాతో రా."

అలాచేయడమే మంచిదని అనుపమ ఒకసారి అనుకున్నది. అతని కాళ్ళపైబడి క్షమాపణకోరా లనుకున్నది. 'డబ్బున్నవాడివి కాబట్టి కొంతపైకం బిచ్చంగాయిస్తే యెక్కడికైనా పోయి చాటునపడివుంటా' నని అడగాలనుకున్నది. కాని చాలసేపాలోచించి "నేను రాను" అన్నది.

ఆమాట పూర్తికాకముందే అనుపమ నీటిలోకి దూకింది.

అనుపమ తనకు స్పృహవచ్చి చూచేసరికి తానొక చక్కనిగదిలో మంచంమీద పడుకొనివున్నది. ప్రక్కనే లలితమోహనుడు కూర్చునివున్నాడు. అనుపమ కళ్ళు తెరుస్తూ కాతరస్వరంతో అన్నది "నన్నెందుకు బ్రతికించావు?"

—o—

# మంచి - చెడ్డ

అవినాశ ఘోషాల్ మరి కొన్ని సంవత్సరాలు ఉద్యోగంచేయగలిగేవాడు. కాని అది సంభవం కాలేదు. ఈసారికూడ తనకంటె జూనియరైన మున్సిఫెవరో తన్ను కాదని సబ్ జడ్జి అయినట్లు వార్తవచ్చింది. రెండోదఫా వలెనే ఈపర్యాయంకూడ ఆయన మెదలకుండా వూరు కున్నాడు. అయితే ఈసారి డాక్టరు సర్టిఫికెట్టుతోసహా వీలైనంత త్వరగా ఉద్యోగంలోనుంచి బయటపడటానికి దరఖాస్తు పంపాడు. అది అంగీకరింపబడటంలో ఆయనకు సందేహంకూడా లేదు.

అవినాశుని కార్యకుశలతతో అందరూముగ్ధులయ్యారు. ఆయన శిష్టప్రవర్తన నందరూ ప్రశంసించుతారు. అయినా ఆయన కీ దుర్గతి పట్టనేపట్టింది. దీనికి తెరచాటున జరిగిన చరిత్ర తెలిసినవారు బహుఅరుదు. ఆకథ చెపుతానువినండి. ఆయన ఉద్యోగంలో చేరిన క్రొత్తలో ఒకసారి ఒక యువక ఐ. సి. యస్. జిల్లాజడ్జిఅయి, ఆఫీసు తనిఖీచేయ డానికి వచ్చాడు. ఏదో చిన్నవిషయంలో యిద్దరికీ అభి ప్రాయభేదం వచ్చింది. తర్వాత అదే పెద్ద జగడమైంది. తిరిగి వెళ్ళిన తర్వాత జడ్జిగారు నిరంతరం ఆయనపనిలో తప్పులుపట్టే ప్రయత్నంలో వున్నాడు. కాని, తప్పుదొర

కడం అంతసామాన్యంకాదు. అందుకా జడ్జిగారేమాత్రం సంతృప్తిచెందలేదు. అతని తీర్పును ఖండించి చూచుకున్నాడుగాని, అది హైకోర్టులో నిలిచేటట్టులేదు; పైగా తానే సిగ్గుపడవలసివస్తుంది. ఇలావుండగానే అతనికి బదిలీ అయ్యేతరుణం వచ్చింది. అవినాశ్ మరోజిల్లాకు బదిలీ అయి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళేముందు జడ్జిగారిని సందర్శించేందుకు పోనేలేదు. గౌరవ ప్రదర్శనకిబదులో అతనివల్ల గొప్పతెప్పిదమే జరిగింది. తర్వాత కొన్ని సంవత్సరాలు గతించాయి. ఈసంగతి అవినాశ్ మరిచేపోయాడు. కాని, ఆయనమాత్రం విస్మరించలేదు. ఇందుకు ప్రమాణం ఈమధ్యనే కనపడింది. ఆ యునక్క జడ్జీ యిప్పుడు హైకోర్టుకు వచ్చారు. మున్సబులువగైరాల జీవితాలిప్పుడు ఆయనచేతిలోనే వున్నై. అవినాశ్ సీనియరేగాక కర్తవ్యనిర్వహణలో బాగా ప్రసిద్ధిచెందాడు. ఆయన ప్రమోషనుకుమార్గం అన్నివిధాల నిష్కంటకంగా వుంది. అయినా అకస్మాత్తుగా ఆయనను బదులు అంతకంటె క్రింది వుద్యోగి సబ్‌జడ్జి అయిపోయాడు. అది అంతటితోనే ఆగిపోలేదు. ఒకరొకరుగా ముగ్గురు వ్యక్తులు ఆయన్ను వదిలేసి ముందుకు వెళ్ళిపోయారు. అసలు సంగతి తెలియనివారు 'ఇది ప్రభుత్వోద్యోగమే; అందులోనూ యింత పెద్ద వుద్యోగం! ఇలా జరుగుతుందా? ఇది కాజీలయుగమా ఏం?' అనేస్తారు. అనుభవజ్ఞులు

మాత్రం 'ఆఁ, ఇంతకంటె దురన్యాయాలుకూడ జరుగు తుంటాయి' అంటారు. కాబట్టి అవినాశ్ తన కింక ప్రమోషను లేదని గ్రహించుకున్నాడు. ఆత్మగౌరవము, ఉద్యోగము-రెండింటిమీద కాళ్ళుంచడం కుదరదు. దేన్నో ఒకదాన్ని నెంచుకోవాలి. ఈసారి అవినాశ్ ఆపనే చేశాడు.

కుటుంబంలో అవినాశ్ పత్ని అశోకలత, ఎ. ఏ. తప్పిన కొడుకు హేమాంశుడు, కూతురు శాశ్వతీ వున్నారు. దాస- దాసీజనం ఎక్కువగానే వున్నారు.

అవినాశు డానాడు ఆఫీసునుంచి సంతోషంగా తిరిగి వచ్చాడు. యథారీతిని బట్టలుమార్చి, కాళ్ళు, చేతులు కడుక్కొని ఫలహారానికి కూర్చుంటూ "హొస్, యిన్నాళ్ళకైనా విముక్తి వచ్చింది. గవర్నమెంటునుంచి ఇంకా ఆర్డరు రాకపోయినా హైకోర్టులోని నా స్నేహితుడు నా జైలుబంధనం వదిలినట్లు తంతిపంపాడు. ఎంతో ఆలస్యమయింది. అస లాలస్యం కాదని నాకు తెలుసులే" అన్నాడు. అశోకలతసమీపంలోనే ఒకకుర్చీలోకూర్చుని ఏదో కుట్టుతోంది. కూతురు శాశ్వతి తండ్రిప్రక్కనే కూర్చుని విసురుతోంది. ఆయన అన్నమాటలు విని యిద్దరూ ఉలిక్కిపడ్డారు.

"అంటే?" అని భార్య అడిగింది.

"ఈసారికూడా ఎవరో గోవిందబాబు నన్ను వెనక్కి నెట్టి సబ్ జడ్జి అయ్యాడు. హాగ్ దొరగారు హైకోర్టు

లోకి వచ్చినతర్వాత ఈ మూడేండ్లనుంచీ యిలాగే జరుగుతూ వస్తోంది. తమ అన్యాయాన్ని ఏనాటికైనా గ్రహించకపోతారా అనుకున్నాను; కాని అది జరిగేట్టులేదు. అదీగాక ఆ మనిషి వున్నంతకాలం ఊపిరాడకుండా కష్టంగావుంది. ఇన్నాళ్ళనుంచి ఓర్పువహించానుగాని, ఈ సహించటంతో వ్యక్తిత్వమే నశించిపోతుంది.

నిన్న సాయకాలం చూచివద్దామని సబ్ జడ్జిగారి యింటికి వెళ్ళినప్పుడూ ఈ సంగతే చూచాయగా విని వచ్చింది ఆలోకలత. కాని అసలువిషయం ఆమె కప్పుడూ అర్థంకాలేదు,యిప్పుడూ బోధపడలేదు. "ఉపాయమూ, ప్రయత్నమూ లేకుండా, గట్టిగా అడగనిదె యీకాలంలో ఏపనిమాత్రం జరుగుతుంది? వ్యక్తిత్వాన్ని నిల్పుకొనేందుకు ఏంచేశారో నేను వినవచ్చా!" అన్నది.

"నేను ఉపాయమూ చూడలేదు, తగాదాపెట్టుకొని ప్రయత్నమూ చెయ్యలేదుగాని, చేయగల్గినది మాత్రం చేసేశాను" అవినాశ్ అన్నాడు.

ఆలోకలత భర్తమొహంవంక చూస్తూవుండిపోయింది. ఇంకా విషయ మామెకి అర్థంకానేలేదు.ఆమెభయపడిపోయింది. "ఏంచేసివచ్చారో కాస్త చెప్పగూడదూ? వింటానుగా" అన్నది మల్లీను.

"ఏముంది! రాజీనామా ఇవ్వడమే. పంపించేశాను."

ఆలోకలతచేతిలోని సూదీ, గుడ్డా జారి క్రిందపడినై.

పిడుగుపడినట్టు కాసేపు స్తబ్ధుగావుండిపోయి తర్వాత యిలాఅన్నది— "ఏమిటి మీారనేది? ఇంతమందిని ఆకలితో చంపెయ్యడానికే సంకల్పించుకున్నారా? బారువుద్యోగం వదిలేస్తేనా, ఒట్టేసి చెపుతున్నా— నేను చచ్చిపోతాను."

అవినాశ్ మౌనంగా కూర్చున్నాడు. ఆమె మాటల కేమీా బదులు చెప్పనేలేదు.

"రాజీనామాపత్రం పంపించేసినట్టయితే రేపే ఉపసంహరించుకున్నట్లు రాస్తానని మాటివ్వండి. ఏం?" అన్నది భార్య.

"ఊఁ హూఁ"

"ఎందుకని? విచారోద్రేకంలో ఏమేమొ చేస్తారు ఎవరైనా. కాని, దీనికి ఇంకేమీా తిరుగులేదాయేం?"

అవినాశ్ మెల్లగా చెప్పాడు—"నేనేమీా ఆవేశంలో చెయ్యలా ఆ పని. నేను బాగా ఆలోచించే చేశాను."

"అయితే ఉపసంహరించుకోరా?"

"ఊఁహూఁ"

"అయితే నేను చచ్చిపోవాలనేనా మీా కోరిక?"

"నే నలాంటిది కోరనని నీకూ తెలుసు. నువ్వు అర్ధాంగివై యుండికూడ పతిగౌరవమర్యాదల నీవిధంగా నాశనం చేస్తే నేను ప్రజలముందు తలెత్తుకుని నిలబడలేనప్పుడు—"

ఆపైమాట అవినాశ్ నోట్లోనే వుండిపోయింది.

పూర్తికాకుండానే "అయితే ఏమంటారూ?" అనడిగింది భార్య.

ప్రత్యుత్తరంగా ఒక కటూక్తి నోట్లోకివచ్చిందిగాని, ఈసారికూడ అవినాశ్ ఆమాట బయటికి అనకముందే కూతురు మధ్యలో అడ్డువచ్చింది. ఇంతవరకు ఆమె మెదల కుండా వింటూన్నది. ఇక ఊరుకోలేకపోయింది.

"కాదు నాన్నగారూ, ఇప్పుడు అమ్మకి ఆలోచించే శక్తి లేదు. మీరామెకు జవాబేమీ చెప్పలేరు. పోనీండి" అంది.

కుమార్తెమూర్ఖత్వం చూచి తల్లి హతబుద్ధి అయింది. మరుక్షణంలోనే బిగ్గరగా చీవాట్లువేస్తూ అన్నది—
"శాశ్వతీ! నువ్విక్కడనుంచి వెళ్ళిపో. ఊఁ"

"వెళ్ళాల్సివస్తే నాన్నగారిని తీసుకొనే పోతానమ్మా! నీదగ్గర వదిలేసిమాత్రం వెళ్ళను" అన్నది కూతురు.

"ఏమన్నావ్!"

"నీవద్ద వారిని ఒంటరిగా వదిలేసి పోనన్నాను. అలా ఎన్నటికీ పోను. పద నాన్నా. అలా నదిఒడ్డున తిరిగి వద్దాం. రాత్రికి మీకోసం నేనే వంటచేస్తాను. లేచి పద నాన్నా" అని ఆమె తండ్రిచేయిపట్టుకొని లేవదీసింది.

ఇద్దరూ నిజంగానే వెడుతూండడం చూచి ఆలోకలత కొంచెం తమాయించుకొని అన్నది—'కొంచెమాగండి. ఉద్యోగం వదిలేస్తే మీ కుటుంబంలో ఇంతమందీ ఏం

తిని బ్రతుకుతారో ఒక్కసారైనా ఆలోచించారూ?"

అవినాశుడు జవాబు చెప్పబోయాడు కాని, ఈ పర్యాయంకూడ కుమార్తె అడ్డుతగిలింది—"నిజంగా నీకు నాన్ననుగురించి అంత విచారంగా వుందా అమ్మా! కాని ఏడవాల్సిన అవసరంలేదు. ఉద్యోగం వదిలేసినా నాన్న గారికి ఫించనువస్తుంది—అదైనా మూడువందలకు తక్కువ వుండదు. పక్కింటి సజీవబాబుకి అరవైరూపాయలజీతం వస్తుంది. తినేవాళ్ళు ఎనిమిది తొమ్మిదిమంది వున్నారు. వారు తినేదీ మనతిండి కేమీ తీసిపోదే. నే నెన్నిసార్లు చూడలేదు. మరి వారికి జరిగిపోతూంటే, మన నలుగురికీ గడవకపోతుందా?" అన్నది.

తల్లి కోపంపట్టలేకపోయింది. కటువుగా అన్నది—"ఛా నాకళ్ళెదుటనుంచి. నువ్వు కాపురంచేసేటప్పుడు చూపిద్దువుగానిలే, తెలివితేటలు. ఇప్పుడు నా సంసారం విషయంలో కలుగజేసుకొంటివా, నిన్ను యింట్లోంచి గెంటేస్తాను, తెలిసిందా?"

కుమార్తె నవ్వి "మంచిదేనమ్మా; అలాగేచెయ్యి. నాన్నని తీసుకొని నే వెళ్ళిపోతాన్లే. నాన్న ఫించను అంతా నువ్వూ, అన్నయ్యా తీసుకొని మీ యిష్టంవచ్చినట్టు చేసుకోండి. మే మేమీ అనంలే. నే నే ఆడపిల్లల బడిలోనో వుద్యోగంచేసి నాన్నగారికి జరుపుతాను. సరేనా?" అంది.

తల్లి ఇంకేమీ మాట్లాడలేదు చూస్తూచూస్తుండగానే ఆమెరెండుకళ్ళనుండి అశ్రుధార ప్రవహించసాగింది.

కుమార్తె మెల్లగా తండ్రిచేయి నొక్కి "పద నాన్నా ప్రొద్దుకూకవస్తోంది!" అన్నది.

అవినాశుని అడుగు ముందుకుపడగానే ఆలోకలత పైటచెంగుతో కనీళ్ళు తుడుచుకొని గద్గదకంఠంతో "కొంచె మాగండీ! ఎందుకు మీ యీ భీష్మప్రతిజ్ఞ? ఇంకేం మారేది లేదా? అని అడిగింది.

"ఉఁహుఁ, ఇంక మారే దేమీ లేదు."

"చూడండీ, నేను మీ భార్యను. మీ కష్టసుఖాల్లో సమభాగినినికదా—"

అవినాశ్ మధ్యలోనే ఆపి "అదే నిజమైతే ఈనాళ్ళనుంచీ నా సుఖాలు నీవూ అనుభవించావు; ఇంక నా కష్టాలుకూడ పంచుకో" అన్నాడు.

"అందుకు సిద్ధమేగాని, మరి గౌరవ - మర్యాదలు నిలుపుకోటానికి ఇప్పుడువస్తున్నదే చాలకుండావున్నదే, అలాంటప్పుడు పించనుడబ్బుతో ఎలా జరుగుతుందండీ?"

"గౌరవ - మర్యాదలంటే డబ్బుడాబేననుకుంటే అది మాత్రం సాగదని ఒప్పుకుంటాను. కాదంటావా, సజీవ బాబుకు జరుగుతూనేవుందిగా."

"మరి మీ కూతురో? పందొమ్మిది - యిరవై యేళ్ళ దాకా వచ్చాయే, దాని పెళ్ళెప్పుడు చేస్తారు?"

తల్లికి కూతురే సమాధానమిచ్చింది-"నా పెళ్ళినిగూర్చి నువ్వు విచారించవద్దమ్మా. ఆలోచించాలనుకుంటే సజీవ బాబు ఇద్దరు కూతుళ్ళ పెళ్ళిళ్ళు యెలా చేశాడో సూచించు"

ఈ జవాబునిని తల్లికివున్న ఓర్పు కూడాపోయింది. సజల నేత్రాలు ఎర్రబడినై. గద్గదస్వరం పంచమస్వరా న్నందుకున్నది. "శాశ్వతీ, నీ నోరుమండ! నా యెదుటనుండి పోవేమే? పో, చెప్పటంలేదూ?" అని కసిరింది.

"వెడుతున్నాలే అమ్మా; నడువు నాన్నా"

ప్రక్కగదిలో హిమాంశుడు కవిత అల్లటంలో నిమగ్నుడైవున్నాడు. మూడోసారి ఐ. ఏ. పరీక్షకు కూచోవటానికి ఇంకా వ్యవధివుంది. అతని పద్యాలు 'వాతాయన్' పత్రికలో పడుతూండేవి. ఇంకే పత్రికా తీసుకొనేదికాదు. 'వాతాయన్' పత్రికా సంపాదకుడు ఉత్సాహపరుస్తూ "హిమాంశుబాబూ! మీ కవిత్వం చాలా బాగున్నది. మరో శీర్షిక - పంపండి. దానితోపాటు శాశ్వతీదేవి రచనకూడ తప్పకుండా సంపండే" అంటూ వ్రాసేవాడు. ఆ సంపాదకుడు నిజమే రాస్తున్నాడో లేక ఎగతాళిగా రాస్తున్నాడో తెలియదు. లేక ఆయన మనస్సులో యింకేమైనా వున్నదో! శాశ్వతి ఆజాబు చూచి నవ్వుతూ "అన్నయ్యా, దీన్ని స్నేహితులకు చూపించుతూ తిరిగేవు!" అనేది.

''ఏం?'' అనేవాడు హిమాంశుడు.

''ఏం లేదు, ఊరికేనే అంటున్నాను. తెలివితక్కువను బయటపెట్టుకుంటూ తిరగటం మంచిదా?''

తన కవితను పత్రికకు పంపేముందు సోదరికి చదివి విన్పించేనెపంతో పిల్చి తనతప్పులను సరిచేయించుకొనేవాడు. సవరణలు మరీ యెక్కువైనప్పుడు సిగ్గుపడి ''నీలాగా నేను నాన్నగారివద్ద సంస్కృతవ్యాకరణం, కావ్యాలు, సాహిత్యం చదవలేదుగా. నా దోషమేముంది? అయినా—శాశ్వతీ, ఇదో లెక్కలోదికాదు. పదిరూపాయలిచ్చి ఒక పండితుణ్ని వుంచుకుంటే అంతా కుదిరిపోతుం దనుకో. కవిత్వానికి అసలు జీవం కల్పన, భావం, ప్రకటనలలోనే వుంటుంది. వాటిసంగతి నీ పిచ్చి నాన్నకేం తెలుసు!" అనేవాడు. అవు ననేది చెల్లెలు.

హిమాంశుని కేదో చక్కని అంత్యప్రాస తట్టింది. కాని తల్లి కఠోర కంఠధ్వని దాన్ని చెదరగొట్టేసింది. కలం క్రింద పెట్టేసి, ప్రక్కద్వారంగుండా తలుపు తన్నుకొని ఇవతలిగదిలోకి అడుగుపెడుతూండగానే ''ఒరేయ్ హిమాంశ్, మనకు సర్వనాశనమైందీ విన్నావా!, ఆయనగారు ఉద్యోగం వదిలేశారు. లేకపోతే వారి మానవత్వం మసైపోతుందిగదూ! ఎందుకనుకున్నావ్, వారుకాకుండా మరొకరు సబ్ జడ్జి అయినందుకు. తాముకాలేదట! ఇది ఈర్ష్య, అచ్చంగా ఈర్ష్యే; యింకేంకాదు''అని తల్లి బిగ్గ

రగా అరిచింది.

హిమాంశుడు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి "ఏమి టమ్మా నువ్వు చెపుతున్నది? ఉద్యోగం వదిలేశారా? ఎంత తెలివితక్కువ!" అన్నాడు.

అవినాశ్ తెల్లపోయాడు. పళ్ళు కదనొక్కుకొని మౌనంగా వుండిపోయాడు. అప్పు డాయన మొహం మసక వెల్తురులో అదోలా వుంది.

శాశ్వతి పిచ్చెక్కినదానివలె అరిచింది— "అబ్బ! ప్రపంచంలో మొండితనానికి అంతేలేదాయేమిటి? మీరు నడవండి, త్వరగా పదండి—లేకపోతే నేను తలబాదుకుని చస్తాను" అంటూ దాదాపు అచేతనావస్థలోవున్న తండ్రిని తీసుకొని ఆమె ఇంట్లోంచి బయటికి వెళ్ళి పోయింది.

—•••—

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL.A1.09.TS.101 |
| పుస్తకం పేరు | ఛాయాదేవి |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 103 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | K Daveen |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |